# దీపిక

(కథా, కవిత, వివిధ, రచనల ప్రేరిత సంచిక)

విజయశ్రీ ప్రచురణలు
**9-3-8** గిర్మాజీపేట, వరంగల్.

ఎడిటర్:
## వై. విద్యాసాగర్
యం. ఏ. (లిట్) బి. ఎడ్.

గౌరవ పోషకులు

శ్రీ ఆర్. నటరాజన్, యం. కాం.
శ్రీ డా॥ పి. దశరథం, యం. డి.
శ్రీ జి. జగన్మోహన్‌రెడ్డి, బి.కాం. యల్.యల్.బి.
శ్రీ జి. బ్రహ్మయ్య
శ్రీ దేవా మధుసూదన్
శ్రీ ఆరెకపూడి జగన్నాథరావు
శ్రీ పి. రంగారావు, జగిత్యాల
శ్రీ కాసుగంటి నారాయణరావు, జగిత్యాల

ప్రచురణకర్త:
శ్రీ సాంబరాజు యాదగిరి

# విషయ సూచిక:



ముఖ చిత్రం: శ్రీ యం. డి. ఖమ్రుద్దీన్, దర్గా, ఖాజీపేట.

# అభినందన

శ్రీ విద్యాసాగర్ గారికి,

దీపిక ఆవిర్భావం సాహితీ రంగంలో చీకటి తొలగించే ప్రయత్నం. ఎన్ని పత్రికలున్నా, ఎన్ని సంస్థలున్నా, పెరుగుతున్న సాహితీ రంగానికి యింకా కొరతే. దేని సేవ దానిదే. యువతరానికి వెలుగు నిచ్చేవి, ప్రతిష్ఠులైనవారికి పేరు తెచ్చేవి. యీ దీపిక ద్వారా అందగలవని నా ఆశ. పుంఖాను పుంఖాలుగా వెలువడుతున్న నేటి సాహిత్యంలో మీరు అందించే రసగుళికలు దీపికకు ప్రత్యేక విశిష్ఠత చేకూర్చగలవని నా విశ్వాసం.

—పోటుకూచి సాంబశివరావు
బి. ఏ. యల్. యల్. బి.
అడ్వకేట్, సికింద్రాబాద్.

---

శ్రీ వై. విద్యాసాగర్ గారికి:

సామాజిక సంస్కరణకై, సత్యం, ధర్మం. సమత, మమత, సత్ శీలాదుల పెంపొందించుటకై "దీపిక" సంచికను మీరు వెల్వరిస్తున్నందుకు సంతోషము. మీ కృషిలో ప్రతి ఒక్కరు సహకరించాలని ఆశిస్తూ, ఈ సందర్భంగా, నా అభినందనలు, శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

యం. రామారెడ్డి
యం. ఏ. బి. ఎడ్
ప్రధానోపాధ్యాయులు

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల
బొల్లికుంట

---



జి. జగన్మోహన్ రెడ్డి
బి కాం, యల్ యల్. బి.
గిర్మాజీపేట, వరంగల్.

మిత్రుడు వై. విద్యాసాగర్ గారికి:

మీ రచనా యుక్తిని, సాహిత్య దీక్షను ఉపయోగించి మీరు వెల్వరిస్తున్న "దీపి." సంచిక ముందు ముందు యింకను అన్ని రుచుల వారికి ఉపయోగపడేటట్లు మీకు మిత్రులు, సాహిత్య పరులు, శ్రేయోభిలాషులు తోడ్పడాలని భగవంతున్ని ప్రార్థిస్తున్నా.

# ఆలోచన

ఒక సాహితీ పత్రిక తీయాలని, విజ్ఞానాన్ని వెదజల్లాలని, సమస్యలతో సతమతమయ్యే వారికి పరిష్కారం చూపాలని, చీకట్లో చిన్న దీపమైనా వెలిగించాలనే తపనకే రూపం ఈ "దీపిక". అన్ని వయస్సుల వారికి ఆనందము విజ్ఞానము, వినోదము, కలిగించాలన్నది ధ్యేయము. చదివించి, ఆలోచనలు కల్గించే రచనలు కొత్త వారినుంచి, ప్రముఖులనుంచి, ముఖ్యంగా యువతీ యువకులు, విద్యార్థులు, పెద్దల నుండి సేకరించి ప్రచురించాలనే తలంపు

మా ప్రయత్నము వ్యాపార దృష్టితో కాదు. మన ద్వారా సమాజానికి, దేశానికి ఎంతైనా మేలు జరిగి సకల మానవ కళ్యాణము జరగాలనేది అందుకు రచనలు "దీపిక"లై తొలికిరణాలు ప్రసరింప జేయాలని మా ఆకాంక్ష.

సత్యం, ధర్మం, న్యాయం, సత్ప్రవర్తనాది సుగుణాలు మనలో వర్ధిల్లుటకు కులమత రాజకీయాల కతీతంగా కృషి చేయాలనేది, దీపికకు దీప్తి. నీతికి, శాంతికి సహనానికి, సహృదయతకు స్ఫూర్తి నిచ్చునదే దీపిక.

సాహితీ, సాంస్కృతిక, సౌభాగ్య విద్యాకేంద్రముగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చైతన్యానికి ప్రతీకగా భాసిల్లుతున్న అలనాటి కాకతీయ సామ్రాజ్య రాజధానియైన, ఈ నాటి వరంగల్ నుండి నూతనోత్తేజంతో తెలుగు జ్యోతిని వెల్వరింప చేయటానికి దీపిక దేదీప్యమానంగా వెలగాలని మా కోరిక.

విజయశ్రీ ప్రచురణలు పేర దీపికను వరుసగా "సంచిక"ల రూపంగా తీయుటకు సంకల్పించాము. సహృదయులు దాతలు సహకరిస్తే మున్ముందు ప్రభుత్వానుమతితో పత్రికా రూపాన్ని సంతరించుకుంటుంది, దీపిక. లేదా ఆర్థిక ఒనరులు, అవకాశాలు, మీ సూచనలననుసరించి అప్పుడప్పుడు మ్యాగజైన్ రూపంలో వెల్వడుతూ సాహితీ సేవ చేస్తుంది "దీపిక" సంచిక.

మీ సహకారాన్ని, ప్రోత్సాహాన్ని కోరుకుంటూ,

— వై. విద్యాసాగర్

# ప్రేమ - త్యాగం

— శ్రీమతి గోలి లలిత, వరంగల్

"బాబూ".... అది అమ్మ పిలుపు. కాదు, ఆర్తనాదం. ఆయాస పడుతూ అతి ప్రయత్నం మీద గొంతు పెగుల్చుకొని మరీ పిలుస్తోంది దడదడ లాడేగుండెతో అమ్మవేపు చూడలేక మరీ చూశాను. ముఖం పూర్తిగా నల్లబడింది. జుట్టంతా రేగిపోయి చూడడానికి భయంకరంగా కనబడుతుంది. కళ్ళు చూడలేక పోగా తనను చూడడానికి ప్రయత్నిస్తున్నది. అమ్మను చూస్తుంటే తన కడుపు తరుక్కుపోతోంది. "అమ్మ" తన ప్రాణానికి ప్రాణమైన తనతల్లి ఆమె లేకుండా తను ...... ఆలోచించలేక పోయాడు. తను జీవించ గలడా? తనలోని ప్రతి అణువు అమ్మ కష్టార్జితమే. అమ్మ తన రక్తాన్ని నీళ్ళు చేసుకొని తనను ఇంత వాణ్ణి చేసింది. తనను డిగ్రీవరకు చదివించింది. మోహన్ కళ్ళవెంబడి ధారావాహికంగా నీళ్ళు ప్రవహిస్తున్నాయి. అతడి మనసు పరిపరి విధాలా ఆలోచిస్తున్నది.

"అమ్మ" పిచ్చితల్లి ఆమె ఆశలన్నీ తనమీదే పెట్టుకొని తనేదో ఆమెకింత ముద్ద పెడతానని ఆశపడింది. నాన్న అంటే, ఎవరో, ఆయన ఎలా ఉంటారో కూడా తనకు తెలియదు. తనకు ఊహ తెలిసినప్పటినుండీ తనసర్వస్వం "అమ్మే" తను పురిటి గుడ్డల్లో ఉన్నప్పుడే యాక్సిడెంట్‌లో నాన్నగారు పోయారు. అప్పటి నుండీ అమ్మే తనను ఆమె ఊపిరిగా, ప్రాణంగా పెంచుకుంది. తన చిన్న తనంలోనైనా అమ్మకు కనీస ఆర్థిక సాయం చేయడానికి వెనకా ముందూ ఎవ్వరూ లేకపోయేవారట. తనే స్వయంగా గుండె నిబ్బరంతో బ్రతుకు ఇంతదూరం ఈడ్చుకొచ్చింది. రాత్రింబవళ్ళు మిషన్ కుడుతుండేది. ఆడబ్బుతో తామిద్దరికి పొట్టగడుపుతూ ఉండేది. ఆమె కడుపు మాడ్చుకొని తనకడుపునింపుతూ తనను స్కూలుకు కూడా పంపించింది. తనకు కొంత జ్ఞానం రాగానే "అమ్మా నేను స్కూలు మానేసి ఏదైనా పని చూసుకుంటాను. నువ్వు ఒక్కదానివి కష్టపడుతుంటే, నేను హాయిగా తిని వెళ్ళిరావడం నాకు ఇష్టంలేదు" అని తను అమ్మను ప్రాధేయపడిన నాడు ససేమిరా తనమాట వినలేదు "బాబూ.... నువ్వు ఇలా మాట్లాడితే నా గుండె ఆగిపోతుందిరా. నేను మీ నాన్నగారు వెళ్ళిపోయాక ఈ కుళ్ళు సమాజంలో ఎన్నో అవమానాలపాలై ఎన్నో అపనిందల పాలైనా చావకుండా బ్రతికానంటే నీ కోసం, అంటే నా కొడుకుకోసం. విన్న

ఎలాగైనా పై చదువులు చదివించాలనే ఆ కాంక్షతో. నువ్వు బాగా చదువుకొని మంచి ఉద్యోగం చేస్తుంటే చూడాలని, నిన్ను ఒక ఇంటివాడిని చేసి నువ్వు కళకళలాడుతుంటే చూస్తూ ఆనందించాలని. బాబూ ఎవ్వరైనా ఏదో ఒక విధంగా కష్టపడందే వాళ్ళ కడుపు నిండదు.... మీ అమ్మ కష్టపడుతున్నదీ అనుకోవడం నీకి చాలా పొరపాటు నాన్నా అమితంగా కష్టపడేవాళ్ళు ఈ ప్రపంచంలో ఎంతో మంది ఉన్నారు. చూడు బాబూ నువ్వు నా గురించి లేని, పోని ఆలోచనల్లో పెట్టుకొని నీ చదువు పాడుచేసుకో హాయిగా ఆనందంగా ఉంటేనే . మోహన్, నువ్వే నా తుది శ్వాస ప్రాణానివి నీ కన్నా ఈ సమాజంలో 'నా' అనేవారు నాకెవ్వరూ ......" అని బోధపరిచి నా నోరు మూయించేది.

అమ్మ ఆశలను తుంచివేయకుండా నా నిర్ణయాన్ని తోసిపుచ్చి, ఎలాగో అయిష్టంగా చదువు చదువుతూనే, ఆ సంవత్సరం ఇంటర్ పూర్తి చేశాను తర్వాత డిగ్రీలో సీటు సంపాదించుకొని జాయిన్ అయ్యాను, డిగ్రీలో చేరగానే అమ్మ అప్పుడప్పుడు వెనకేసిన డబ్బుతో తనకొక డ్రెస్ కుట్టించింది. తను డిగ్రీలోనికి వెళ్ళగానే అమ్మ ఆనందానికి అవధులు లేవు. తనను ఎంతో ప్రీతిగా ఒళ్ళు నిమురుతూ తనమీద ముద్దుల వర్షం కురిపించింది. "బాబూ నా కష్టం ఫలించింది. నా నాన్న పెద్దవాడయ్యాడు, అని ఎంతో సంతోషించింది. అమ్మ తన శరీరంలో లేని తాహతును ఉత్సాహాన్ని తెచ్చుకొంటూ ఇంకా ఎక్కువ కష్టపడసాగింది ఒక రోజు తను కాలేజీ నుంచి రాగానే అమ్మ పడుకొని కనిపించింది. సామాన్యంగా అమ్మ ఎప్పుడూ నడుంవాల్చదు. ఎప్పుడూ ఏదో ఒక పనిలో లీనమై కనబడుతుంది. "అమ్మా ఏమిటీ పడుకున్నావ్? ఆరోగ్యం బాగా లేదా?" అని తన ప్రక్కన కూర్చొని ప్రశ్నించగానే అమ్మ ఉలికి పడుతూ గాభరాగా లేచి దిండును తలక్రిందులు చేసి పట్టుకుంది మళ్ళీ వెంటనే మామూలుగా "వచ్చావా బాబూ . ఇవ్వాళ చాలా తొందరగానే వచ్చావేం" అని ప్రశ్నించింది. తను ఆమె ప్రశ్నకు జవాబివ్వకుండానే దిండును తిప్పిచూశాడు దానిలో కాసింత రక్తం పడిఉంది. అమ్మా . ఏమిటిది" అసహనంగా అరిచాడు. "ఏమిలేదు బాబూ ... అప్పుడప్పుడూ కాస్త దగ్గులా రావడం నీకు తెలుసుగా. ఇప్పుడు కాస్త మరీ ఎక్కువగా వచ్చింది అంతే ..." అని తీసి పారేసింది. అమ్మా.... ఈ ఒక్క డ్రెస్ చాలని మొత్తుకున్నా వినకుండా ఉన్న డబ్బుతో ఇంకో డ్రెస్ కుట్టించావు. ఇప్పుడు నీ ఆరోగ్యం దెబ్బతింది. డాక్టరు దగ్గరకు వెళ్దామంటే పైసా లేకుండా ఖర్చుచేశావు. ఇప్పుడెలా....?" అని

తను మొర పెట్టుకుంటే.... "ఇవ్వుడు నాకు ఏమైంది బాబూ.... సుబ్బరామయ్య తాతగారు రోజూ కాస్త కషాయం ఇస్తున్నారు ఆయన హస్తవాసి మంచిది. మూడు నెలలపాటు తాగితే తప్పనిసరి నయమౌతుందని చెప్పారు. నువ్వేం కంగారుపడకు" అని నచ్చచెప్పింది.

కాల ప్రవాహంలో తనుడిగ్రీ పూర్తి చేసుకున్నాడు. సుబ్బరామయ్యగారి కషాయం అమ్మ ఆరోగ్యాన్ని ఏ మాత్రం నయం చేయలేకపోగా, మూడింతలు పెరిగింది వ్యాధి అమ్మ పూర్తిగా మంచంలో పడిపోయింది ఇన్నాళ్ళూ తనభారం అమ్మదైతే, ఇప్పుడు అమ్మభారం తనది. ఎలాగైనాసరే అమ్మను తను బ్రతికించుకోవాలి. అందుకు డబ్బుకావాలి. అది కావాలంటే తనేదైనా పనిచేయాలి. పని చేయడానికి తను సిద్ధమే ఏ పనిఅయినా ఎలాంటిపని అయినా తను చెయ్యగలడు కానీ ఆ పని తనకు చూపించి డబ్బు ఇచ్చే మహనీయుడు కరువైపోయాడు. తని డిగ్రీ తనకెలాంటి సహాయం చెయ్యలేక పోతుంది ఆ డిగ్రీ కాగితం చూస్తుంటేదాన్ని చిగలబెట్టాలనిపిస్తోంది. తన తల్లిని ఈ స్థితికి తెచ్చిందీ ఆ కాగితమే. భగవంతుడు ఇంత నిర్దయుడా? మా అమ్మ ముఖం చూసైనా నాకేదైనా చిన్న ఉద్యోగం చూపించకూడదా? మనస్సు పరిపరివిధాలా రోదించింది. అతని హృదయంఅల్లకల్లోలంగా తయారైంది.

రెండు రోజుల క్రితమే పక్క వీధిలో ఉండే డాక్టర్ గారైన రఘు రామయ్యగార్ని తీసుకొచ్చి చూపించాడు. "మోహన్ మీ అమ్మగారు చాలా సీరియస్ అని చెప్పాలి బాబూ.... ఈ వ్యాధికి నేనిచ్చే మందులు ఆమెలో ఏమంత పని చెయ్యగలవు చెప్పు? ఈ రోజుల్లో క్షయ అంటే భయపడాల్సిన పనేమీలేదు. ఈజీగా నయమైపోతున్నది. ఎలాగైనా డబ్బు తయారు చేసుకొని సాధ్యమైనంత త్వరలో పట్నం తీసుకెళ్ళి అక్కడ ఎడ్మిట్ చేశావంటే చాలు అంతా వాళ్ళే చూసుకుంటారు, మీ అమ్మగారు ఆరునెలల్లో పూర్తిగా ఆరోగ్యవంతురాలౌతుంది. అనిచెప్పివెళ్ళిపోయారాయన. అమ్మ ప్రాణాలు తనుకాపాడుకోలేడా? తన గురించి అంతత్యజించిన అమ్మకు తను ఈ మాత్రం చెయ్యలేడా? ఎలా? ఇప్పుడు తను ఏంచేయాలి ఏం చేస్తే అమ్మను తను పట్నంలో చేర్పించేంత డబ్బు తన చేతికి వస్తుంది? పిచ్చివాడిలా తిరిగాడు కాళ్ళుఅరిగిపోయాయి. మనసంతా భారంగాభయంకరంగాఉంది. తన మనసు నిండా ఒక్కటే ధ్యేయం ఎలాగైనాసరే,అమ్మను తను బ్రతికించుకోవాలి.

రోజు రోజుకూ అశచచ్చిపోయి నిరాశ ఎదురు కాసాగింది. తను అంత మొత్తం డబ్బును సంపాదించలేకపోతు

న్నాడు. చేజేతులా తన తల్లిని చంపుకో గలడా? వీల్లేదు అమ్మ బ్రతకాలి అమ్మకు తను ప్రాణభిక్ష పెట్టాలి. అమ్మకు తను ఆ మాత్రం సాయపడలేకపోతే తన బ్రతుకే వ్యర్థం. అమ్మ బ్రతకాలి. అమ్మ లేక తను జీవించలేడు.

ఆలోచిస్తూ నడుస్తున్న తనను రఘు రామయ్య డాక్టరుగారు పలకరించారు. "మీ అమ్మగార్ని ఇంకా తీసుకు వెళ్ళ లేదా మోహన్ .. కన్నకొడుకువు ఆమెను ఇంత అశ్రద్ధ చేస్తె ఎలా? " అని ఆయనకు తోచిన విధంగా నాలుగు చివాట్లు వేశారు. ఇంకా అలస్యం చేస్తే ఆవిడ బ్రతికదని కూడా ఖచ్చితంగా చెప్పేసి తన దారిన తాను వెళ్ళిపోయాడు. మోహన్ లోని జవసత్వాలన్నీ ఉడిగి పోయినట్లయి నిస్పృహాయంగా కూలబడి పోయాడు. తను ఉట్టి అసమర్థుడేనా? రఘురామయ్యగారు అన్నట్లు అమ్మ చచ్చి పోతుందా? తల్లిని మించిన దైవం లేదంటారు. తన తల్లి కోసం తను ఏం చేస్తున్నాడు. మోహన్ గుండె వేగంగా కొట్టుకోసాగింది.

ఆరిపోతోతున్న దీపంలో నూనె వేస్తే వెలిగినట్లుగా మోహన్ కళ్ళు జిగేలున మెరిశాయి. ఎదురుగా ఫామిలీ ప్లానింగ్ డిపార్ట్మెంట్ వాళ్ళ టెంపో నిలబడి ఉంది. వెనకాముందూ ఏమీ ఆలోచించ కుండా ఒక్క గంతులో వెళ్ళి టెంపో ఎక్కేశాడు. ఫ్యామిలీ ప్లానింగ్ వాళ్ళతో ఘోరమైన అబద్ధం ఆడేశాడు. "అయ్యా నేను నిరుద్యోగిని నాకు ముగ్గురుపిల్లలు ఆపరేషన్ కావాలి" అని.

మోహన్ ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించుకున్నాడు వాళ్ళిచ్చిన వంద రూపాయిల్నితన ప్రాణం కన్నా మిన్నగా దాచుకొని ఇంటిముందు రిక్షాదిగాడు. ఇంట్లో పదిమందికి పైగా జనం పోగై ఉన్నారు, అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. వాళ్ళను చూడగానే మోహన్ గుండె స్తంభించి పోయినట్లయింది. చైతన్యం లేని శరీరంతో తనను లానే తోసుకొని వెళుతున్నట్లుగా ఎలాగో గుమ్మంలో అడుగు పెట్టాడు "అమ్మ" తన తల్లిని క్రింద దింపిరి చాపలో పడుకోబెట్టి అందరూ తనవే పేజాలిగా చూస్తున్నారు "అమ్మ" పంచభూతాల్లో కలిసిపోయింది

"అమ్మా ..." దిక్కులదద్దరిల్లేల గుండె పగిలేలా గొంతు చించుకొని అరిచాడు. పాపం మోహన్! ఈనా నిరుద్యోగ సమస్యలో బలైపోతున్న ఇలాంటి మోహన్ లు ఎంతమంది__





## అభిషేకం

శ్రీరాజరాజేశ్వరా–అభిషేకమొనరింతునా!
కన్నీటి ఝల్లులు – కురిపించనా!
కనుపించవా – కరుణించవా
కలలోనైనను – కనరావా! ॥శ్రీ॥

కలలు కంటి – కనుపింతువని
కల్లగాదు – నా "కల" గా
కన్నీరె – మున్నీరు గా
కదలిపై – పొరల గా
సేవింతునా – అభిషేకింతునా ॥శ్రీ॥

దరిశన మీయవా – దయరాదా
కరుణలేదా – నీ మనసు కరుగదా
అంధకార బంధురమైన
అజ్ఞానావృత జీవిత నౌకకు
"దీపిక"నై "దరి" చేర్పగరావ ॥శ్రీ॥

పాపహరణ – ఫాలలోచనా
ఫణిహారా – పాలించరావా
పాపపై నా కంటిలో
వెలుగువై . నా హృదిలో
నా కన్నీటి కడలిలో
"దీపిక"వై దీపించరావా ॥శ్రీ॥

పదములంటి – వేడితినిన్ను
పరి పరి విధముల ప్రార్థన జేసితి
పరమ శివా – పాప హరా
పాలించరావా ॥శ్రీ॥

—పి గోపాలరావు
వరంగల్.

## పోతన మాధురి

వన్నెలందీర్చిదిద్దగను భాగవతమ్మును
వ్రాయు నాటికిన్
నన్నయ తిక్కనల్ మొదలు, నాడును
తెల్గున వ్రాయకుందురా
కన్నది విన్నదిన్ తెలియ కమ్మని
భావము దెల్పుటన్ గదా
అన్నలు ఎందరో గనియు అందుకె
వ్రాయగ లేదా పోతనా!

పండితులెందరో మొదట భాగవతమ్మున్
తెనిగించిరో గదా
మెండుగ నెందరో కవులు మేలుగ
వ్యాఖ్యలు వ్రాసిరెవ్వియో
అందగ నీవు రాముడని యంటివి
భాగవతమ్ము వ్రాయుచున్
ఎందను సేవ్యముగా వలచి యెందను
వ్రాసిరి పోతరాజులై

ఎన్నడు వ్రాసి భాగవత మెన్నడు
ముద్దుల గట్టితివి మున్
ఎన్నడు పంచినారు కవులెంతయు
భాగ్యము నీదటంచు, నీ
మిన్నని మాటలన్ బలికి మా
హృదయంబుల దోచుకొంటివే
వెన్నల మాటలన్ వినన వెన్నుడు
నెఱతిగ ముగ్ధుడయ్యెనో

ఒమ్మెగియంబు బుట్టినను భారత జాతికి
మార్గదర్శివై
కమ్మని పద్దెముల్ సరళ కావ్యపు శైలిని
రాజు గోరగన్
అమ్మక సింగ భూవరుని యయ్యతు
నేనియు యమ్మనంచు అ
యమ్మను బుజ్జగించినటు యంతయు
వింటిమి యెంత భాగ్యమో

—జె. శ్రీనివాసమూర్తి
పెసరవల్లి.

# నవయువత

యువశక్తి అణుశక్తికంటె గొప్పది. బాధ్యత గుర్తించి ప్రవర్తిస్తే మానవ కళ్యాణానికి ఎంతగ ఉపకరిస్తుందో, అదుపు తప్పితె మానవ మారణహోమానికి అంతగానే దోహద పడుతుంది.

మానవ చరిత్రంతగూడ పోరాటాల చరిత్రే. మానవుడు తన మనుగడకు మొదట ప్రకృతితోను, కాలక్రమమున తోటి వానితోగూడ పోరాడవలసివచ్చింది. సమాజాన్ని అజ్ఞానం నుండి విజ్ఞానం వైపు, బానిసత్వంనుండి స్వేచ్ఛవైపు మరల్చే క్రమంలో యువతరంది విశిష్ఠమైన పాత్ర ఉంది. సమాజ క్రమాన్ని సరిగా అధ్యయనము చేసి మన పూర్వీకుల జీవన విధానం అర్ధం చేసుకోగలిగితె, వారికంటె మనం ఎంతో ఉన్నత స్థితిలో జీవిస్తున్నాం. ఈ మనస్థితికి వారి త్యాగాలే కారణం. ఇంతకంటె ఉన్నతమైనటువంటి, దోపిడిలేని వర్గ రహిత సమాజాన్ని నిర్మించి భావితరాలకు అందించేందుకు నేటి యువతరం పూర్వీకుల వారసత్వాన్ని ఆదర్శంగా తీసుకోవాలి. విత్తనం మొక్కై, మ్రానై, పూవై, ఫలమై దానినుండి వచ్చిన గింజ తిరిగి విత్తనంగా మారలేనిస్థితికి వస్తే దాన్ని ఆ చెట్టుకు పుట్టిన బీజమనరు. పూర్వీకుల త్యాగాల ఫలితాలు అనుభవిస్తు రాబోవు తరాల కొరకు ఏ మాత్రం త్యాగం చేయకపోతె అది స్వార్థం అనిపించుకుంటుంది.

"ఈ రోజు యువతరం అత్యధిక శాతం మూఢాచారాలకు, మత్తు మందుకు, వ్యభిచారానికి, వ్యాపార సరళి చదువులకు, వరకట్నానికి, అష్టాదేటు ఫ్యాషన్సుకి. విశృంఖల స్వేచ్ఛకు బానిసై తమను తాము మరచిపోయారు."

ఇందులకు కారణము పచ్చి శృంగారాన్ని విచ్చలవిడిగా ప్రచారం చేసే చౌకబారు సాహిత్యము, సినిమాలు, ఎప్పుడు అందుబాటులో ఉండే సారాయి కొట్లు, వ్యభిచార గృహాలు ఇవివ్యక్తుల మెదల్లకు దల్లు కట్టుటేకాదు, వారిలోని సృజనాత్మక శక్తిని, విమర్శనాత్మక దృక్పథాన్ని సమాధి చేస్తాయి.

యువతీ యువకుల గణనీయమైన పాత్రలేకుండ సమాజం మంచివైపు మలుపు తిరుగదు. సమాజాభివృద్ధిలోనే తన అభివృద్ధి ఉందని, ఒకరుగా అది సాధ్యం కాదనే ప్రాథమిక సత్యం గుర్తించాలి, తమకంటు ఏర్పరచుకున్న క్రమశిక్షణలో చైతన్యవంతమైఉండాలి. గతాన్ని శాస్త్రీయంగా అర్ధం చేసుకున్నపుడే వర్తమానం సరిగా బోధపడుతుంది. అప్పుడే భవిష్యత్తును గూర్చిన నిశ్చితమైన అవగాహన ఏర్పడుతుంది. నాడే యువత నవతకు నాందిపలుకుతుంది. భావి తరాలకు ధృవతారలుగా వెలుగొందుతారు.

—శ్రీ డి. లక్ష్మీనారాయణ
వరంగల్ కోట.

## చెప్పండి ఏమిటో!

1. రాముడే కృష్ణుడు-కృష్ణుడే రాముడు
2. చీకటే వెలుగు - వెలుగే చీకటి
3. అమ్మే నాన్న - నాన్నే అమ్మ
4. చెట్టే గుట్ట - గుట్టే - చెట్టు
5. గుండే కొండ - కొండే - గుండు
6. గొయ్యే నుయ్యి-నుయ్యే-గొయ్యి
7 మంచమే కంచము-కంచమే-మంచం
8. అరుగే పరుపు - పరుపే - అరుగు

(ఉత్తమ సమాధానాలు పంపిన వారికి బహుమతులు ఇవ్వబడును)

## స్త్రీ పురుషానుబంధం

ఆమె భాష - అతను భావం
ఆమె వివేకం - అతను శాసనం
ఆమె ధర్మం - అతను హక్కు
ఆమె అర్పణ - అతను కరుణ
ఆమె రాగం - అతను పాట
ఆమె ఇంధనం - అతను అగ్ని
ఆమె కీర్తి - అతను తేజం
ఆమె వెలుగు - అతను దీపం

—విష్ణు పురాణం నుండి
మాలతీ చందూర్

---

హేమామాలినికి గుర్రపు స్వారీ తెలుసు. కారు, జీప్, లారీలను కూడా ఆమె నడప గలదట.

## జీవిత లక్ష్యం

జీతం మీద జీవితం
జీవితం ఎన్నో సమస్యల వలయం
బ్రతుకు నావ సుడి గుండంలో
మునిగిపోతున్నప్పుడు
ఆ సుడి గుండాన్ని తప్పుకున్న తర్వాత
కదా! గమనం
చీకటి అడవిలో చిక్కుకున్నప్పుడు
అడ్డంకులులేని మార్గాన్ని
వెతుక్కొన్నాం కదా! మనం
ఆకలి చీకట్లో తల్లడిల్లుతున్నప్పుడు
పట్టెడు మెతుకుల వెలుగులు
కడుపులో చేరుతున్నప్పుడు కదా!
జీవిత లక్ష్యానికి దారి వెతకడం

జి. రామమూర్తి
హసన్‌పర్తి

### జనాభా!

భారతదేశ ప్రస్తుత జనాభా 683.81 మిలియన్లు. పెరుగుదల రేటు సంవత్సరానికి 2.4% ఐనా జనాభా పెరుగుదల రేటు 1 2% ఐనా జనాభా 975 మిలియన్లు.

## మొటిమలా!

పిండి పదార్థాలు, క్రొవ్వు, చాక్లెట్స్, కోడిగుడ్లు, వెన్న, నెయ్యి వాడకం తగ్గించండి. క్రీమ్స్ వాడకూడదు.

# రచయిత (త్రి) లకు సూచనలు:

1. సభ్యులుగా చేరండి
2. కథలు, సీరియల్స్, నాటికలు, నాటకములు, కవితలు, జోక్స్, వ్యాసములు "దీపిక" విషయ సూచిక ననుసరించి పంపగలరు.
3. తెల్ల కాగితముపై ఒక ప్రక్కనే వ్రాయవలెను.
4. రచనలు తమ స్వంతమని, దేనికీ అనువాదము కాదనీ హామీ పత్రము పంపాలి.
5. కలం పేరుతో పాటు విధిగా తమ పూర్తి పేరు, చిరునామా తెలుపవలెను.
6. స్వంత చిరునామాతో తగిన పోస్టేజీ స్టాంపులంటించిన కవరును పంపినచో ప్రచురణకాని రచనలు తిరిగి పంపబడును

---

మాష్టార్: ఏరా: రాము మూడు ముళ్ళు?
రాము:- "పెళ్ళి" సార్
మాష్టార్; ఏరా! గోపీ డేలీ పేపర్ వలన ఉపయోగ మేమిటి?
గోపి:- కిరాణం కొట్టువాళ్ళు పొట్లాలు కట్టుకోవచ్చు సార్

—వై. ప్రదీప్
వరంగల్.

# శ్రీ గణపతి సాంస్కృతిక సమితి

గిర్మాజీపేట, వరంగల్ వారి ఐదవ వార్షికోత్సవం నాగార్జున సాగర్‌లో జరిగింది. శ్రీ పి. రాజయ్యగారి ఆధ్వర్యంలో కార్యవర్గ ఎన్నికలు ఏకగ్రీవంగా జర్గినాయి.

అధ్యక్షులు:- శ్రీ జి. జగన్మోహన్ రెడ్డి
ఉపాధ్యక్షులు:- శ్రీ జి గోవిందు
" శ్రీ దేవా మధుసూదన్
ప్రధాన కార్యదర్శి:
శ్రీ వై విద్యాసాగర్
కార్య నిర్వాహక కార్యదర్శులు:
1. శ్రీ ఆర్. వీరనారాయణ
2. శ్రీ కె. సత్యనారాయణ
సహాయ కార్యదర్శులు:
1. శ్రీ యం. బి బ్రహ్మాచారి
2. శ్రీ పి. వీరనారాయణ
ఆర్థిక కార్యదర్శి:
శ్రీ కె లక్ష్మినారాయణ
సలహా దారులు:- శ్రీ యస్. యాదగిరి
శ్రీ కె లక్ష్మయ్య

---

# రచయిత:

నీ కన్నీళ్ళ నీపై, లోకంపై వాటిని ప్రవ్వులుగా వెదజల్ల కలిగినప్పుడే, అక్షీర సాగర మథనం నుండే నిజమైన రచయిత జన్మిస్తాడు.

# డబ్బు కోసం ...?

—శ్రీ యస్. వీరేశ్వరరావు
హైదరాబాద్

పేషెంటు వెళ్ళగానే కాలింగ్ బెల్ నొక్కాను మరో పేషెంటు కోసం. లోపలి కొచ్చిన పేషెంటుని చూచిఆశ్చర్యపోయాను.

'నమస్కారమండీ' అంటూనా పక్కనున్న స్టూలుపైన కూర్చుంది.

నమస్తే చెప్పి 'నువ్వు బయటికెళ్ళి తలుపెయ్యి' అని తలుపు దగ్గరనిలబడ్డ ఆయాకి చెప్పాను.

బయటికెళ్ళి తలుపు దగ్గర వేసింది.

'నురండీ ... నాకండీ'

కడుపొచ్చిందా? అన్నాను.

ఎట్లా తెలుసుకున్నారు? అన్నట్లు ఆశ్చర్యంగా చూసి

అ... వు .. నండీ తలదించుకుంటూనే అంది.

మరల ఎవరిపేరు చెబుతుందో తెలుసుకుందామని

ఎవరు చేశారు అనడిగేను.

... రమేష్ నేను ప్రేమించుకున్నామండీ ....కాని ఇప్పుడతను పెళ్ళిచేసుకుంటానికి నిరాకరించాడు.... కాని నాకు.... ఇప్పుడు తొందరపడటం వలన .... దీన్ని తీసెయ్యాలండీ అంది.

నాకు నవ్వు మండింది.

ఇప్పటికే రెండుసార్లు కడుపు తీయించుకున్నట్టు నాకు గుర్తు. ముందున్న రిజిష్టరులో వ్రాయటానికని

నీ పేరేమిటి?

సుశీల

పేరువ్రాస్తూ "చూడమ్మా సుశీలగారు నేనడిగేనని నువ్వు బాధపడవద్దు,

అసలు సుశీల అంటే ఏమిటో నీకు తెలుసా?"

" ....... "

నీ వయస్సు చూస్తే పదహారు సంవత్సరాలు కూడా దాటలేదు. అప్పుడే నీకు రెండు కడుపులు తీశాను, ఇది మూడో కడుపు

లేదండీ .... నాకు కడుపు రావటం ఇదే మొదటిసారి అంది.

ఆమాడిన అందమైన అబద్దానికి చలించిపోయాను. కోపం ముంచు కొచ్చింది. చేతిలోవున్న రిజిష్టర్‌ని వెనక్కి తిరగేశాను. ఆమె నావంక రిజిష్టర్ వంక భయంభయంగా చూడడం నేను గమనించలేక పోలేదు. ఒకచోట ఆగిపోయి చదివేను.

ఇదే సంవత్సరములో జనవరి పద్దెమిదిన నా దగ్గరికొచ్చి నన్నొకడుమోస

చేశాడు. నాకు మూడో నెల కడుపొచ్చింది తీసేయమని ప్రాధేయపడితే.

అయ్యో పాపం చిన్న వయస్సులోనే కాలుజారింది ఇప్పుడు ఆ పిల్లను ఆదుకోకపోతే ఆమె జీవితం వ్యర్థమవుతుందని తీశాను. ఆరోజు నీకేం చెప్పానో గుర్తుందా?

చూడమ్మా! నీకు చూస్తే నిండా పదహారేళ్ళు లేవు. ఇప్పుడే ఏమిటి నీకీ పాడుబుద్ధులు. ఇంత చిన్న వయస్సులోనే కడుపులు తీసేస్తే నీకు పెళ్ళవుతుందో లేదోగాని ముందు నీ ఆరోగ్యం క్షీణించి పోతుంది. అబార్షన్ చేయటం ప్రాణంతో చెలగాటం నిండు ప్రాణాలతో ప్రయోగించటం తేలికేగాని అబార్షన్ చేయటం చాల భయంకరమైన పద్ధతి డాక్టర్‌గా చెప్పని నేను నిర్ధారిస్తాను. కాని ఒక తల్లిగా చెప్తున్నాను. ఇక ముందెప్పుడు ఇలాంటి తప్పటడుగులు వేయవద్దని హెచ్చరిస్తున్నాను అన్నాను. అప్పుడు నీవేమన్నావో తెలుసా?

'క్షమించండి. తెలియక పొరబాటు చేశాను. మరెప్పుడు చేయనన్నావు' అని మరో పేజీ తిరగేశాను. ఆమె కళ్ళలో నీళ్ళు సుడిలా తిరుగుతున్నాయి.

ఇదే సంవత్సరం ఏప్రిల్ ఇరవై తొమ్మిదో తారీఖున మరల వచ్చావు. ఎవరు చేశారు అనడిగితే శంకరం అనే నా కాలేజి క్లాస్‌మేట్ నన్ను నమ్మించి మోసం చేశాడని భోరున ఏడ్చావు. అప్పుడు శంకరం అని పేరుచెప్పితే దాంటోచ్చి ఇక్కడ నోట్ చేసుకున్నాను.

ఆ రోజు కూడ చెప్పాను. ఇంత చిన్న వయస్సులో అబార్షన్ చేస్తే ఆరోగ్యం పాడవుతుందని. ఆ రోజు నేను బాగా ఆలోచించి నీకు దెబ్బ తక్కువయి తప్పటడుగులు వేస్తున్నావనే వుద్దేశంతో నా ఫీజు మొదటిసారికన్నా రెండురెట్లు ఎక్కువ చెప్పాను. అయినా అంగీకరించావు

ఇప్పుడు రమేష్ అనే వ్యక్తి అంటున్నావు. ఇప్పటికే ముగ్గురు వ్యక్తులయ్యారు. దీన్నిబట్టి చూస్తుంటే వాళ్ళు నిన్ను మోసం చేయటంలేదు నువ్వే వాళ్ళను మోసం చేస్తున్నట్లు కనిపిస్తుంది అన్నాను కోపంతో నోట్లో వోణీ కొంగు పెట్టుకొని కుమిలి కుమిలి ఏడుస్తుంది.

నిన్ను ఇలా ఒంటరిగా పంపిస్తున్నారు. నీకు తల్లిదండ్రులు, అక్కా చెల్లెళ్ళు, అన్నదమ్ములు ఉన్నారా? ఆవేశంతో అడిగాను.

బపీమని క్రిందికి వంగి నా కాళ్ళు పట్టుకుంది

డాక్టర్! ... నన్ను క్షమించు.... ..... డాక్టర్ ఈ ఒక్క సారికి నన్ను కాపాడు ...... ఇంకెప్పుడు ఇలాంటి పనులు చేయను డాక్టర్ అని ఏడుస్తూ ప్రాధేయ పడింది.

నా ఆడమనస్సు ఒకసిట్టూర్పు విడిచింది.
ఆమెను పైకిలేపి కూర్చోబెట్టి,
నేనడిగిందానికి సమాధానం చెప్పు
నీకు తల్లిదండ్రులున్నారా?
" .........."
స్టెతస్కోప్ తీసుకొని ఆమె బాడీటెస్ట్ చేయటం ప్రారంభించాను.
చెప్పు మీ ఫామిలీ ఎంతమంది?
"అమ్మ అన్న, అక్క ఉన్నారండీమాది చాలపూర్ ఫామ్లీడాక్టర్"
మీ బ్రదర్ ఏంపని చేస్తారు?
ఒక ప్రైవేటు కంపెనీలో పని చేస్తారు.
జీతం ఎంతొస్తుందో తెలుసా?
ఎంతొస్తుందో తెలియదు కాని ... మూడు వందలు ఇంట్లో ఇస్తారు దాని తోనే ఇంటిరెంటు కట్టుకొంటూ మేం నలుగురం బ్రతకాలండీ అంది
"మరి నీకు ఈ ఫీజు కట్టటానికి" డబ్బు ఎవరిచ్చారు?
" .........."
నిన్ను ప్రేమించి మోసం చేసిన వాళ్ళు ఇస్తారా?
అవునన్నట్లు తల వూపింది.
అసలు వాళ్ళు పెళ్ళి చేసుకుంటామని ఎప్పుడైన చెప్పారా?
నీకు కావలసినప్పుడల్లా ఇస్తాంగాని పెళ్ళంటూ చేసుకోమని చెప్పారండీ
వాళ్ళు బాగ డబ్బున్న వాళ్ళ కొడుకులా?
అవునన్నట్లు తల వూపింది.
ఇప్పుడు ఈ రమేష్ అనే అతను కూడా....?
నేను పనిచేసే ఫ్యాక్టరీ యజమాని మేనల్లుడు.
చదువు మానేసి ఫ్యాక్టరీలో పని చేస్తున్నావా? ఆశ్చర్యంగా అడిగాను.
అవును డాక్టర్
ఎందుకని?
"చదివించ లేను కాలేజీకి వెళ్ళవద్దని చెప్పాడు అన్నయ్య. అయినా మాఅన్నయ్య ఇచ్చే మూడువందలు జీతం చాలటంలేదు."
మీ అన్నయ్య చేర్పించాడా?
'అసలు ఆ ఫ్యాక్టరీ ఎక్కడుందో మా అన్నయ్యకే తెలియదు. నేనేస్వయంగా వెళ్ళి చేరాను.'
'బెడ్ మీద పడుకో'; పడుకున్న తర్వాత టెస్ట్ చేస్తూ
ఈ రమేష్‌తో పరిచయం ఎలా అయ్యింది?
దానిలో మేనేజర్‌గా పని చేస్తున్నాడు.
అతనికి పెండ్లి కాలేదా?
" ...... ...."
చెప్పు?
యింకా నిదానంగా అంది.
పెళ్ళయిన వాళ్ళను ఎందుకు ప్రేమించావ్?
" .........."

'ఫర్వాలేదుచెప్పు ఈ రూమ్‌లో ఎవరూ లేరులే'

వుద్యోగం ఫర్మనెంటుచేస్తాడేమోనని ... నీ అమాయకపు ఆలోచనకు నవ్వాలో ఏడ్వాలో కూడ అర్థం కావటం లేదు....

చేస్తా నన్నాడా?

చేస్తానన్నాడు .... కాని మా విషయం ఫ్యాక్టరీ యజమానికి తెలిసి .... నన్ను తీసేశాడు ...అంద దిగులుగా

వచ్చేనన్ను ఆపుకున్నాను.

మరి మీ మేనేజర్ ఏమన్నాడు?

"మా మామయ్య ఇక ఎవరు చెప్పినా వినడు .. నీకు డబ్బు కావలసి ప్పుడల్లా ... నన్నడిగి తీసికెళ్ళు" అన్నాడు

దీనికి ఫీజు అతనే ఇచ్చాడా?

అవును

పెళ్ళి చేసుకోమని అడగ పోయావా?

అడిగాను....కాని చేసుకోనన్నాడు

ఈ విషయాలన్ని మీ వాళ్ళకి తెలుసా?

ఎవరికి తెలియదు

నువ్విలా బయటకు వస్తే వాళ్ళడగరా?

....ఫ్రెండ్స్ ఇంటికి వెళ్తున్నానంటే వాళ్ళేమి మాట్లాడరు.

చాల అమాయకంగా జవాబుచెబుతుంది.

మరి మీ అన్నయ్య?

మా అన్నయ్య అయిదారు రోజులకో సారి ఇంటికి వస్తాడు

ఏం?కొంపలేమైన వుంటాయా!

కాదండి; ఇంటి దగ్గరుండటం అంత ఇష్టం వుండదట

ఈమె చెప్పే జవాబులను బట్టిచూస్తే వాళ్ళ ఫ్యామిలి కంచెలేని చేనులాంటి బ్రతుకు తుందని తెలుసుకో గలిగాను అ తల్లి, పిల్లల భవిష్యత్తు గురించి ఎప్పుడైనా ఆలోచిస్తుందో లేదో నా కర్థం కావటం లేదు.

....ఇంట్లో కొంచెం ఇబ్బందిగా వున్న ప్పుడల్లా రమేష్ దగ్గరకువెళ్తుంటాను . అలా వెళ్ళబట్టే .. మరలా... వచ్చింది ఆమె కండ్లనుండు నీళ్ళుకారుతున్నాయి.

నాకు ఎందుకో జాలేసింది. వీళ్ళ కుటుంబాన్ని ఆదుకోవాలనే కోర్కె నా మనస్సులో పుట్టింది. బుద్ధిగా ఉంటుం దనే వుద్దేశంతో.

ప్రైవేటు లేబరేటరీలో చేర్పి స్తాను చేరుతావా?

ఆమె కళ్ళలో వెలుగురేఖలు ప్రకాశిం చాయి.

చేరతానండీ

కాని అక్కడ కూడ ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే ...... ?

లేదండీ ...ఏదో తెలియక డబ్బుకి ఆశపడి కాలుజారాను. డబ్బున్నవాళ్ళను

---

ఈ శతాబ్ది డెబ్బయిల లెక్కలప్రకారం అమెరికాలో జన్మించిన ప్రతిఆరో బిడ్డా పెళ్ళికాని తల్లికి జన్మించినదే.

ప్రేమించి పెళ్ళి చేసుకుంటే మా బ్రతుకులు బాగుపడతాయని తొందరపడ్డాను. .... వాళ్ళంతా నా శరీర వాంఛకోసం ప్రేమించినట్లు నటించారని తెలుసుకున్నాను నన్ను నమ్మండి పాత్రిధేయపడుతూ అంది.

ఆర్థిక బాధలవల్ల కాబు జాగించవని అనుకున్నాను... కాని పేదవాళ్ళలోకూడ ఎంతమంది నిజాయితీ పరులు లేరు? ఆర్థిక బాధల వల్లనే కాదు. చిన్నప్పటి నుండి క్రమశిక్షణా సహితంగా పెంచక పోవటమే ఇందుకు కారణం అనితోచింది. పోని ఒకరికి సహాయపడి ఒక కుటుంబాన్ని బాగుచేయటంలో తప్పులేదనుకొని.

నాలుగు రోజులు రెస్ట్ తీసుకో .. అ తరువాత నన్ను కలిస్తే నేనొక రికమండేషన్ లెటర్ వ్రాసి పంపిస్తాను. పెళ్ళి చేసుదువుగాని.

అనిచెప్పి అమెకు చేయవలసినవన్ని చేసి కొన్ని టాబ్లెట్స్ ఇచ్చాను. అలాగే నండీ అని రెండు చేతులతో నమస్కరించి ఫీజు చేతిలో పెట్టింది. లెక్కపెట్టి చూస్తే రెండోసారి ఇచ్చినట్లే రెండురెట్లు ఫీజు ఇచ్చింది. మామూలుగా తీసుకోవలసిన ఫీజు తీసుకొని మిగిలినవి అమెకిచ్చేశాను.

• • • • • • • • • • •

గుడ్ ఈవినింగ్ డాక్టర్?

గుడ్ ఈవినింగ్ చెప్పి తలపైకెత్తాను. అరడుగుల ఎత్తు కిర్లిహెయిర్, విశాలమైటి మొఖం, బ్లూషర్ట్ వైట్ పాంట్‌తో వచ్చిన అ వ్యక్తిని చూచి ముందు మెడికల్ రిప్రిజంటేటీవ్ అనుకున్నాను. కాని వాళ్ళ సింబల్‌గా చేతిలో బాగ్ లేకపోవటము వలన పేషెంట్ అనుకున్నాను. సరాసరివచ్చి నాకెదురుగా వున్నచైర్‌లో కూర్చొని

డాక్టర్ ... మీ తమ్ముడు .. చైతన్య ....

అ ఏమయింది? అన్నాను కంగారుగా వాడు నా చిన్న తమ్ముడు. నాకే కాదు మా ఫామిలి మొత్తానికి గారాల కుర్రాడు. ఇప్పుడు కాలేజీలో బి.యస్సి. చదువుతున్నాడు.

అతని షర్టు జేబులోనుండి ఒక ఫోటో తీసి నాకందించాడు. అ ఫోటోని చూచి అదిరిపోయాను. మా తమ్ముడు చైతన్య సుశీల కలిసిదిగిన ఫోటో అది. అ ఫోటోని చూచి కొంతసేపటి వరకు నోటివెంట మాటరాలేదు. కొంతసేపు పరీక్షించి అతనివైపు చూశాను.

వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారుడాక్టర్ ....

అ మాటకి నా వంట్లో కంపరం బయలుదేరింది. నేనేం మాట్లాడకుండా బయటికి చూస్తున్నాను. ఇంకా పేషెంట్సువున్నారు.

మీరుకొంచెంసేపు బయటకూర్చోండి అని అతన్ని బయటికి పంపి. ఫోటోని పేపర్ వెయిట్ క్రిందపెట్టి మిగిలిన

పేషెంట్స్ని పరీక్షించాను. వాళ్ళను పరీక్షిస్తున్నానే కాని నా మనస్సంతా ఆందోళనగా వుంది. సుశీలపై పట్టరాని కోపం వుంది. చిలక్కి చెప్పినట్లుచెప్పాను. అది మనిషో పశువో అర్థం కావటంలేదు. నేను చెప్పిన నీతులన్నీ వ్యర్థమయ్యాయన్నమాట. పైగా నా క్రిందికే వీళ్ళ తెచ్చిందని కడుపు మండుతుంది.

పేషెంట్సు అందరు అయిపోయారు అని ఆయా చెప్పటంతో చేతి వాచ్ చూసుకున్నాను. క్లోజ్ చెయవలసిన టైంకంటే అరగంట ఎక్కువైంది. ఆ బ్లూ షర్ట్ అతన్ని పంపించి నీవుబయట కూర్చో అని చెప్పాను ఆయాకు. అత నొచ్చి కూర్చున్నాడు. ఇతనే సుశీల అన్నయ్య అయివుంటాడనుకున్నాను. ఇతనికిగుణపాఠం నేర్పించాలనిపించింది. మీపేరేమిటండీ? నవ్వు ముఖంతో నేఅడిగాను.

సుందరం చిరునవ్వుతో చెప్పారు
పరవాలేదు పేరును సార్థకంచేసుకున్నాడు
మీరెక్కడ పనిచేస్తారు?
బిస్కట్ ఫ్యాక్టరీలో పని చేస్తాను
ఈమె...... .. ?
మా సిస్టర్ సుశీల
ఎంతమంది మీ ఫామిలీ?
'తల్లి,ఇద్దరు చెల్లెళ్ళు, నేనుసగర్వంగా' చెప్పాడుబంధుత్వాన్ని కలుపుకుంటున్నా నన్న అనందంతో
ఈమె పెద్దచెల్లెలా? తెలిసికూడఅడిగాను
కాదు ఈమె చిన్న చెల్లెలు
మీపెద్ద చెల్లెలుకు పెళ్ళి చేశారా?
లేదు ఆమెకు కూడ కుదిరితే ఇద్దరికి కలిపి ఈ సంవత్సరం చెయ్యాలని అన్నాడు.
అక్కడికి ఈ పెళ్ళికినేనుఒప్పుకున్నట్లు ఈమె కాలేజీలో చదువుతుందా?

ఆఁ కాలేజి వుపయోగం లేదని నేనే నాకు తెలిసిన వారితో రికమండేషన్ చేయించి ప్రైవేటు ఫ్యాక్టరిలోచేర్పించాను. ప్రస్తుతం మూడొందలు సంపాదిస్తుంది.
నాకు ఆశ్చర్యం వేసింది.
ఏ ఫ్యాక్టరీలోనండీ?

చెప్పాడు అదీ నేను చేర్పించిన ఫ్యాక్టరీయే. ఆ మాటలు విని సుశీల ఒక్కతే కాదు. ఆ ఫామిలీ మొత్తం అబద్దాల పుట్ట అనుకున్నాను.

వెనకటికి ఎవరో అడిగారట ఎలా బ్రతుకుతావే నీకు పని చేతకాదు.అంటే నా కంటే నోరుంది అందట.అలావుంది వీళ్ళ ధోరణి.

అయినా మా తమ్ముడు చైతన్య చదువుతున్నాడు. మీ చెల్లెలు ఫ్యాక్టరిలో

---

చైనాలో ప్రతి నిమిషానికి ముప్పది ముగ్గురు జన్మించడమూ, పదకొండు మంది మరణించడమూ జరుగుతుంది.

పనిచేస్తుంది వీళ్ళిద్దరు ప్రేమించుకోటా నికి అవకాశమెక్కడ? సిగ్గొదిలేసి అడి గాను.

వాళ్ళు.... ...బస్ స్టాప్‌వద్ద పరిచయమై, ఆ పరిచయం ప్రేమకు దిగినట్లు....

సుశీల చెప్పిందా?

కాదు మా మదర్ చెప్పింది.

ఏమని చెప్పింది?

నాలుగు రోజుల క్రితం మా సిస్టర్ బాత్‌రూంలో వాంతులు చేసుకుంటుంటే మా మదర్ నిలదీసి అడిగితే చైతన్య అనే అతన్ని ప్రేమించిందనీ, అతన్నే చేసుకుంటానని అతనూచేసుకుంటానని మాటిచ్చాడని చెప్పి, వాళ్ళిద్దరు కలసి దిగిన ఫోటో, అడ్రెస్సు ఇచ్చిందట. ఆ విషయం ఈ రోజు ఉదయం నేను ఇంటికొస్తే మా మదర్ అన్నివిషయాలు చెప్పింది అప్పటికే మా సిస్టర్ డ్యూటీకి వెళ్ళింది నేను అడ్రెసు ప్రకారం మీ ఇంటికెళ్ళాను మీ ఫాదర్‌ని అడిగితే, మా డాటర్ డాక్టర్ ఆమెతో మాట్లాడు అని హాస్పటల్ అడ్రెస్సు ఇవ్వటంతో ఇక్కడికొచ్చాను. పిల్లలు ఏదో ఆవే శంలో చేస్తారు... వాళ్ళ భవిష్యత్తుబాగు చేయాలంటే మనం....వాళ్ళను ఒకటి చెయ్యాలి అన్నాడు.

అతను చెప్పే ప్రతిమాటనాగుండెకు గుండుసూదుల్లా గుచ్చుకుంటున్నాయి. మా వాడిని మోసం చేస్తుందా? నిజంగా ఇది అడదేనా?

సారీ....మిస్టర్ సుందరం అన్నాను.

డాక్టర్.... మీ తమ్ముడు ప్రేమించిన ఫలితంగా ఇప్పుడు.... ....నెల తప్పింది డాక్టర్ భయపడుతూ అన్నాడు.

ఏం కొత్తగా చెప్తున్నావా. నాకు తెలిసిన వరకు ఇది వాలుగో కడుపు అందామను కున్నాను కాని ఎందుకో ఆగిపోయాను.

పిల్లల భవిష్యత్తు పెద్దలపైన వుంది....

డాక్టర్

ఒకవ్యక్తి ముగ్గుర్ని ప్రేమిస్తే ఆ ముగ్గు రిలో ఎవర్ని చేసుకోవాలి? అన్నాను

షాక్ తిన్నాడు,

'అటువంటివాడు మోసగాడు' కోపంతో అన్నాడు

నా ప్రశ్నకు జవాబు అదికాదు.

ముగ్గుర్ని ప్రేమించి మోసం చేయ టం చట్టరీత్యా నేరం కాబట్టి అటువంటి వాళ్ళను... బజారులో నిలబెట్టి షూట్ చెయ్యాలి మరింత ఆవేశంతో అన్నాడు. కరెక్ట్ .. కాబట్టి ఈ పెళ్ళి జరగదుసావ ధానంగా అన్నాను.

డాక్టర్ ....? మీరు నిజంగాడాక్టరేనా? ....అంటే మీతమ్ముడుముగ్గుర్ని ప్రేమిం చాడు కాబట్టి ఎవర్ని చేసుకోడుఅంటారు అంతేనా? డాక్టర్ కాంతి, ఎం.బి బి. యస్. అనే తాటికాయంత అక్షరాలతో బోర్డు పెట్టుకోవటం కాదు డాక్టర్....

సమాజాన్ని అర్థం చేసుకునే మనస్తత్వం తోటి మనుష్యులకు సహాయపడే గుణం వుండాలి. డాక్టర్ మీరు చూపులకు చాలా మంచివారుగా వున్నారు కాని మీకు నిజంగా హృదయంలేదు. డాక్టర్ ... నీ తమ్ముడు నా చెల్లెల్ని ప్రేమించి పెళ్ళి చేసుకుంటానని చెప్పి మోసం చేశాడని ఇప్పుడే పోయి పోలీస్ స్టేషన్‌కి రిపోర్టిస్తాను, అంటూ ఆవేశంతో లేవబోయాడు

ఆ మాటలకి నాకు అరికాలు మంట నడినెత్తి కొచ్చింది. నన్ను నా వృత్తిని కించపరిచిన ఈ బాస్టర్డ్‌ని చూచి నన్ను నేను కంట్రోలుచేసుకోలేక పోతున్నాను

'అప్పను ఈసమాజాన్ని అర్థం చేసుకునేమనస్సు నాకులేదు తోటివారికిసహాయపడే గుణం అంతకన్నాలేదు. నన్నే నమ్ముకొని కూర్చున్న తల్లి, చెల్లెళ్ళు ఎలా బ్రతుకుతున్నారో, ఎలా ప్రవర్తిస్తున్నారో అర్థంచేసుకోక షోకేస్‌లో బొమ్మలా డ్రీమ్‌గాతయారై వారానికో సారి ఇంటి మొఖంచూసే మూర్ఖురాలుని చెల్లి ఇప్పటికి ఎన్నికడుపులు తీయించుకుందో తెలుసుకోలేని అసమర్థురాలుని ...'

డాక్టర్ ....? తెల్ల మొఖం వేస్తూ అలాగే నిలబడి చూస్తున్నాడు.

యస్ ... ది నో యువర్ సిస్టర్‌లైఫ్ అండ్ యువర్ ఫామిలీ లైఫ్.........

ఇంతకు క్రితమే మా గుర్నీ ప్రేమించి మూడుకడుపులు తీయించుకోటానికి నా దగ్గరకొచ్చింది. మొట్ట మొదటిలోనే చెప్పాను, ఇంత చిన్నవయసులోనే ఈ పాడు బుద్ధులేంటి? అని

డాక్టర్ .... ఈగండాన్ని మీరు తప్పించకపోతే నాకు చావేగతి అని బోరున ఏడిస్తే డాక్టర్‌గా నాకర్తవ్యాన్ని నేను నిర్వర్తించాను వెళ్ళు పోలీస్ స్టేషన్‌కి కాకపోతే కోర్టుకెళ్ళు డేట్‌తోసహా ఏప్పుడెప్పుడు ఎవరెవరితో తిరిగినదిఅక్కడే నిరుపిస్తా అంటూ రిజిష్టర్‌ని తిరగేసి చూపించాను.

అతని ముఖంలో రక్తపు బొట్టు లేదు. నాకు కోపం ఇంకా చల్లారలేదు

చూడు మిస్టర్ మనిషిగా పుట్టడం గొప్పకాదు మనిషిలాపుట్టి సమాజం గౌరవించేలా బ్రతకాలి మనం, మనల్నే నమ్ముకున్న వాళ్ళని మనిషిలాబ్రతికించాలేగాని సమాజానికి ఒకఆటబొమ్మలా వదిలేయ కూడదు అసలు నీ చెల్లెలు ఎక్కడెక్కడ తిరుగొస్తుందోఎప్పుడైనా ఆలోచించావా? అంతే అమెవేసేప్రతి అడుగు గుర్తుంచుకోమనికాదు ఆవేసే అడుగు ఏది మంచో ఏదిచెడో తప్పటడుగుల్లోనే నేర్పించి ఏరోజుకారోజు ఇంటిని జాగ్రత్తగా పరిశీలిస్తే సంఘంలోగౌరవం తానంతటకదే పుట్టుకొస్తుంది ఇంటికి మగదిక్కయిన నువ్వే నట్టించు

కోనినాడు యవ్వనం సంకెళ్ళతో ఉరకలేస్తున్న సమయంలో ఇంటికి పెద్దయిన నువ్వు నీతల్లి అనకట్టలానిలబడకపోతే ఈసమాజం ఎంతకాలం చూసి సహించగలదు?

అసలు ప్రేమించుకోవటం అంటే ఏమిటో? ఒకరినొకరు అర్థం చేసుకొని వాళ్ళహృదయాలలో పరస్పరం కొంత స్థానం లేకుండా ఆఇద్దరేజీవించాలనేకోరికఇద్దరిలో పుట్టినప్పుడు అది ప్రేమించుకోవటం అనటానికి అర్థం వుంది.

కొన్ని రోజులు ఒకరితో, మరికొన్ని రోజులు మరొకరితో అదయినా డబ్బున్న వాళ్ళతోనే, కొత్తకొత్త వింత పోకడలతోతిలా ప్రవర్తించేది అదీ ప్రేమంటావా? నీ చెల్లెలు అంతవరకు దిగజారటానికి కారకులెవరో తెలుసా? నువ్వు, నీ తల్లి,

వంచిన తల ఎత్తి చూశాడు.

మొదటినుండి ఒక క్రమశిక్షణా సహితంగా పెంచకపోవటం వల్లనే నీ చెల్లి ఇంత మందిచుట్టుతిరగగలిగింది. ఏమీ ఎరుగడు, ఈ రోజే కడుపొచ్చిందని డబ్బిసు వుచ్చుకొని పెళ్ళికి ఒప్పించటానికి బయలుదేరావు, రమ్మను నీ చెల్లెల్ని. నా ఎదుటకొచ్చి నిలబడమను? గుండెల మీద చెయ్యివేసుకొని చెప్పమను? నాతమ్ముడు.... అమాయకురాలుగా కనిపించే నీ చెల్లెల్ని ప్రేమించాడేమో కాని, నీ చెల్లెలు మాత్రం పరాయివాళ్ళతో ...... ఛీఛీ నా తమ్ముడు పక్కన నిలబడటానికి కూడ నీ చెల్లెలు అర్హత కోల్పోయింది. అంటూ ఆవేశంలో ఆ ఫోటోను నిలువుగా మధ్యకు చించి సుశీలవున్న ఫోటోముక్కను అతనివైపు టేబుల్ పైకి విసిరాను. అదివెళ్ళి టేబుల్ పై వున్న అతని చేతికి తగిలిఆగింది. అతను ఏమీ మాట్లాడకుండా అలాగే నిలబడ్డాడు.

పేపర్ వెయిట్ని చేతిలోకి తీసుకొని గిరగిర తిప్పుతూ చూడండీ మిస్టర్. నీ ఫామ్లీని కించపరచాలనే వుద్దేశం నాకులేదు. ఇంతకాలం కళ్ళుమూసుకొని కంచెలేని చేనులా మీ కుటుంబాన్నిమీరే బజారుకు ఈడ్చుకున్నారు....

క్షమించండి డాక్టర్... నిజంగా నేను ఇంతకాలం కళ్ళుమూసుకునే బ్రతుకుతున్నాను. సమాజంలో ఎలా బ్రతకాలో అర్థంకానిపరిస్థితులలో పెరిగాను వాళ్ళలా ప్రవర్తిస్తున్నారో అర్థం చేసుకొని అనమర్థుడిలాగ ప్రవర్తించాను. తలవంచుకొని అందులోవున్న సుశీల ఫోటోను చూపుడు వేళ్ళతో తిప్పుతూ అన్నాడు.

సుశీ నన్ను చైతన్యకిచ్చి నీ మంచితనాన్ని నిలుపుకో అని నా అంతరాత్మ ఘోషిస్తుంది అంతరాత్మకు లోనై ఆలోచనలో పడ్డాను.

నేను చూస్తూ వుండగనే ఆ ఫోటో

గిరగిర తిరుగుతూ టేబుల్ మీదనుంచి క్రింద పడింది.... అందుకోటానికి అతను వంగబోయాడు. ఆ ఫోటోలా, ఆమె జీవితాన్ని కూడ అలాగే త్రిప్పేడు అని అనుకున్నాను.

డాక్టర్!....డాక్టర్!.... ఆరే సుందరం నువ్విక్కడే వున్నావా? అంటూ ఒకతను లోపలికి వచ్చేసరికి ఫోటో తీయకుండానే లేచి నిలబడ్డాడు. ఆశ్చర్యంతో నేనలాగే చూస్తున్నాను.

సుందరం ... సుశీల ... సుశీల .... నిద్ర మాత్రలు మింగి చనిపోయింది. ఆ!.... అనుకోకుండా అన్నాము. సుందరం బయటికి పరిగెత్తాడు.

డాక్టర్!... ఆమె మీకు ఇవ్వమనిచ్చి హాస్పటల్ అడ్రసుతో వ్రాసిన లెటరు. ఆమె తలక్రింద పెట్టుకొని చనిపోయింది. అంటూ మడతపెట్టేసి కాగితం నాకిచ్చాడు. దానిపైనా అశ్రుస్సుంది వణుకుతున్న చేతులతో దాన్ని అందుకొని చదివాను.

డాక్టర్ శాంతగార్కి!

నన్ను క్షమించు డాక్టర్.... నేను చిన్న వయస్సులోనే తప్పటడుగు వేశాను. పెళ్ళి చేసుకోవాలనే ఆశ. అది యాస అయ్యింది. నా జీవితం ఎప్పుడో తెల్లవారవలసింది. మీరే ఆదుకున్నారు. మీరు చెప్పిన హితబోధ వినినట్లేనటించి విస్మరించినందుకు నన్ను క్షమించు డాక్టర్ అతను మీ తమ్ముడే అని ఈరోజే అతని ద్వారా తెలుసుకున్నాను. కాని ఎందుకో బ్రతకాలనే ఆశ నశించింది అందుకే వెళ్ళిపోతున్నాను మీరు నాపై కోపంతో కాకుండా ప్రేమతో క్షమిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు

సుశీల

ఊపిరిని నా కన్నీటి బొట్టు ఒకటి ఆ పేరుపైబడి ఆ పేరు ఆనీటిబొట్టులో కలిసిపోయింది.

—సమాప్తం—

---

బిచ్చగాడు: అమ్మా కొంచెమన్నము వెయ్యమ్మా

అమ్మగారు; ఓరి .. నచ్చినోడా కాళ్లు, చేతులున్నాయిగదరా ఏదన్నా పన్జేసుకొని బ్రతకరా.

బిచ్చగాడు; అమ్మగారూ మీకుకూడా చేతులున్నాయి గదమ్మా వాటితోనే బుక్కెడు అన్నం పెట్టమ్మా కాళ్ళు పట్టుకుంటా.

—వై. ప్రదీప్

వరంగల్.

# "వర్డ్స్ వర్త్‌ను కవిని చేసిన ప్రకృతి కావ్య లేక్‌లాండ్"

—మాచర్ల హేమ
యునైటెడ్ కింగ్‌డమ్ (ఇంగ్లాండ్)

ఇంగ్లండ్‌లో ఉత్తరాన స్కాట్లండ్‌కు కొస్తదిగువగా ఉంటుంది ప్రకృతి రామణీయతనుసంతరించుకున్న 'లేక్ డిస్ట్రిక్ట్' దీనినే లేక్‌లాండ్ అని కూడా అంటారు. లేక్‌లాండ్ అంత అందమైన చిన్నచిన్న పల్లెటూర్లతో ప్రతిఊరిచుట్టూ సరస్సులు దట్టమైన రకరకాల వృక్షసంపద. కొండలు, లోయలు, జలపాతాలు. సెలయేర్లతో నిండి యాత్రికుల హృదయాలను పరవశింప చేస్తుంది. లేక్‌డిస్ట్రిక్ట్‌లోని 'విండర్ మియర్' అదేగ్రామంలోని సరస్సు అన్నింటికన్నా చాలా పెద్దది. ఈగ్రామం యాత్రికుల సౌకర్యాలకోసం ప్రత్యేక వసతులు కల్పించబడినవి 'విండర్ మియర్' గ్రామానికి సరస్సు దాదాపు ఆనుకునే ఉంటుంది. ఒకపౌండుటికెట్ కుబోట్‌లో సరస్సంతా తిప్పిచూపిస్తారు అయితే సరస్సు మాత్రమే కాకుండా చుట్టూఉన్న దట్టమైన అరణ్యం, దూరంగాకన్పించే కొండలు కనువిందుచేస్తూ మనసుకు ఆహ్లాదాన్ని కల్గిస్తాయి. ప్రత్యేకంగా ఉషఃకాలంలో బాలభానుని లేత కిరణాలు నీటిలో ప్రతిఫలిస్తూ, వెండి మెరుగులు దిద్దినట్లున్న సరస్సు సౌందర్యం, ఆలలసవ్వడి సంగీతానికి నాట్యం చేస్తూ, చిరుగాలికే కొమ్మలుకదిలి ఆకులు రాల్చే చెట్లు, వాటిక్రింద ఆలలఒరిపిడికి నున్నబడి పరిచినట్లున్న బండరాళ్ళు చూస్తేప్రకృతి కవి 'విలియమ్ వర్డ్స్ వర్త్' కమనీయ కవితలు గుర్తుకు రాక మానవు

విండర్ మియర్‌నుంచి ప్రతికోజూ కోచెస్ ఉంటాయి. వీటిల్లో దాదాపు లేక్ లాండ్ అంతా కాకున్నా కొంతభాగం. ముఖ్యమైన 8 సరస్సులు త్రిప్పి చూపిస్తారు. ప్రతి సరస్సు దగ్గరా డ్రైవర్ ఒక కథ చెప్తుంటాడు. దాదాపు ఈ కథలన్నీ ఎక్కువగా "వర్డ్స్‌వర్త్" కవి గురించే ఉంటాయి. ఈ కోచ్ రూట్ అంతా కొండలపైకి ఎక్కుతూ. లోయల్లోకి దిగుతూ చాలా ఆహ్లాదకరంగాఉంటుంది. చుట్టూ కన్పించే అనంతమైన ఆప్రకృతి అద్భుత సౌందర్యం మరో లోకంలో ఉన్నామా! అనే భ్రాంతి కల్గించక మానదు. దారి అంతా ఆకుపచ్చ, పసుపు, ఎరుపు కలగలుపు రంగులతో దట్టమైన అరణ్యం లాంటి వృక్షజాలం, వాటి వల్లుకున్న పేరు తెలియని అడవి తీగె

లను రంగురంగుల పూలగుత్తులు, కొండలు మీంచి దుమికే జలపాతాలు, కొండ రాళ్ళను ఒరుసుకుంటూ వంపులు తిరుగుతూ లోయల్లోకి పారే సొగసైన సెలయేళ్లు. ఓహో! ఆ ప్రకృతి సోయగం చూడటానికి రెండు కళ్ళూ చాలవు. అంతటి సౌందర్యం తిలకించిన ప్రతి హృదయం స్పందించక మానదు. సామాన్యులనే భ్రమింపచేసే ఆ ప్రకృతి అందం, ప్రకృతి ప్రేమికుడు, కవి అయిన వర్డ్స్‌వర్త్‌ను ఎంత పిచ్చివాణ్ణి చేసిందో.

వర్డ్స్‌వర్త్ మహాకవి లేక్‌లాండ్‌లోని "గ్రాస్‌మియర్" అనే చిన్న అందమైన గ్రామంలో కేవలం ప్రకృతి అందాలకి ముగ్ధుడై గ్రాస్‌మియర్ సరస్సు "Ulls Water" (అల్స్ వాటర్) కన్పించే విధంగా ఒక కుటీరం నిర్మించుకున్నాడట. దానినే ఇప్పుడు "డోవ్ కాటేజ్" (Dove Cottage) అంటారు. వసంత కాలంలో సరస్సు చెంతనున్న చెట్ల క్రింద పూచే బంగారు వన్నె "డాఫొడిల్స్" (Daffodil) పూలు సరస్సు పై తేలివచ్చే మలయ మారుతానికి నాట్యం చూసి పరవశించిన ఆయన కవి హృదయం కమనీయ కవితాగానం చేసే వటదానికి సంబంధించిన ఆయన కవిత "ఎ హోస్టు ఆఫ్ గోల్డెన్ డాఫొడిల్స్, బిసైడ్ ద లేక్ బినీత్ ద ట్రీస్ ఫ్లట్టరింగ్ అండ్ డాన్సింగ్ ఇన్ ద బ్రీజ్" (A host of golden daffodils beside the lake beneath the treesfluttering and dancing inthe breez) చాలా ప్రసిద్ధిగాంచింది.

అరణ్యమంతా కన్పించే విధంగా కొండల దిగువగా లోయల అంచుపై ఒక బండరాతి పైకూర్చొని ప్రకృతి కాంత అందాలకు తన్మయించి పోతూ ఆయన మనసుపాడే కమనీయ గీతాల్ని కవితలుగా లిఖిస్తూ ఈ అనుకోని స్వర్గాన్ని విడిచి మరెక్కడకీ పోలేనని వ్రాసుకున్నాడట. ఈ కవి జన్మించింది 1770లో "కాకర్ మౌత్" అనేచోట. ఆయన పదునాల్గవ ఏట నుంచి ప్రకృతి అందాలను చిన్న చిన్న కవితలతో వర్ణించేవాడు. తర్వాత ఆయన 21వ ఏట ఫ్రెంచ్ భాష వృద్ధి చేసుకొనుటకు "ఫ్రాన్స్" వెళ్ళినపుడు అక్కడొక ఫ్రెంచ్ యువతి "ఆన్నెట్టి వాల్లన్" తో పరిచయం కల్గి అది ప్రణయం లోకి దారితీసి వారికొక పాప కూడా కల్గిందట. కానీ కొన్ని కారణాల వలన ఆమెను ఆమెను వివాహం చేసుకోలేక పోయినాడు. ఒంటరిగా ఇంగ్లండ్ తిరిగివచ్చి ఆన్నెట్టి కోసం, వారికి కల్గిన చిన్నారి పాప కోసం మనసులో ఆక్రోశిస్తూ కవిత్వం వ్రాయడం కూడా మర్చి దిగులుగా ఉండే వర్డ్స్‌వర్త్‌ను అతని కత్యంత సన్నిహితురాలు, అతడి కన్నా ఒక్క సంవత్సరం మాత్రమే చిన్నదయిన అతడి సోదరి "డరోతి" అతడి బాధను అర్థం చేసుకుని అతనిని ఉత్సాహ

పర్వతానికి ప్రయత్నిస్తూ తిరిగి మరెగా అతడి మనసును కవిత్వం పైకి మళ్ళి-ంచింది. డరోతీ కూడా రచయిత్రి. ఆ తర్వాత 1802లో "మేరీ" అనే ఇంగ్లీష్ యువతిని వివాహం చేసుకున్నాడు. ఈమె "విలియమ్"కు తగిన ఇల్లాలు. కానీ అతడి జీవితాంతం మనసులో నిలుపుకుని ఆరాధించింది మాత్రం "అన్నెట్టి వాల్లెన్" అయితే అతడి బాధలన్నింటినీ మరిపించి మురిపించి ఆహ్లాదపరిచి మన శ్శాంతి నిచ్చింది మాత్రం ప్రకృతి కన్య అనిర్వచనీయమైన సౌందర్యం.

తన కవితలలో ఆయన "ఈ అనంతమైన ప్రకృతి అందాలకు నేను పిచ్చివాడిని కావడం తప్ప మరేమీ చేయలేక పోతున్నాను" అని వ్రాసుకున్నాడు

లేక్‌లాండ్ ప్రకృతి రామణీయకత ఏ విధమైన వాతావరణంలో నయినా చెదిరిపోదు. సరికదా ఎంత అందంతో ద్విగుణీకృత మవుతుం-దనుటలో సందేహమేమీ లేదు.

... ఎక్కడ చూచినా అను ... రంగురంగుల రకరకాల పువ్వులతో సూర్య కిరణాలు ప్రతిఫలించే సరస్సు నీటిలో సన్నని మలయ మారుత సంగీతంలో అద్భుత చిత్రకారుని రమణీయ వర్ణచిత్రంలా ఉంటుంది- ఆకురాలు కాలంలో చెట్ల ఆకులన్నీ ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగులతో అదొక మరుపు రాని కమనీయ దృశ్యంలా మనసునిండిపోతుంది, ఇక శీతాకాలంలో సరస్సు నీళ్ళన్నీ గడ్డకట్టి తెల్లగా అతి తెల్లగా వెండిలా మెరుస్తూ ప్రకృతి అంతా సన్నని తెల్లని మేలి ముసుగులాంటి పొగమంచుతో కప్పబడి అదొక వింత అందంనంతరించుకుంటుంది

ఏ ఋతువయినా తిరిగిన నేల, అతడి కలానికి ఊపిరి పోసిన లేక్‌లాండ్‌ను దర్శించుతూంటే మనసు ఒక విచిత్రమైన అనుభూతికి లోనౌతుంది, ఏమైనా లేక్‌లాండ్ ఒక అందాలలోకం, మరుపురాని మనోజ్ఞ సుందర దృశ్య కావ్యం,

---

## తొమ్మిది సుగుణాలు:

1. ప్రేమ, 2. పవిత్రత, 3. వినయము 4. నమ్మకము 5. సరససంభాషణ 6. ప్రసన్నవదనము 7. ధైర్యము 8, అభిరుచి 9. ఉత్సాహము

## అభ్యుదయబాలానంద సంఘం

9-3-8 గిర్మాజీపేట, వరంగల్,

మీ బాలల మానసిక, సాహిత్య, సాంస్కృతిక అభ్యున్నతికై సంప్రదించండి

# చివరి కోరిక

—వై. రత్నాసాగర్
హుజూరాబాద్

బయట కటిక చీకటి. ఆకాశంలో నల్లని మేఘాలు దట్టంగా అలుముకున్నాయి. ఉన్నట్టుండి కత్తి మెరుపులు ఎక్కడో పిడుగుపడ్డట్టుగా ఉరుములు. టౌనంతా ప్రశాంతంగా ఉంది. రోజంతా బస్సుల హారనులతో, సైకిళ్ళ, రిక్షాల గణగణలతో సినిమా ఎడ్వర్‌టైజ్ రికార్డులతో మారుమ్రోగుతున్న టౌను ఒక్కసారిగా కుంభవృష్టి కురుస్తున్నందుకు ప్రశాంతంగా ఉంది రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి గంటన్నర సేపు కుంభపోతగా కురిసిన వర్షం హఠాత్తుగా వెలిసింది. మళ్ళీ రోడ్డుపై గణగణల మోతలు, కారుల హారనులు, ఎక్కడో పెళ్ళి తతంగం వారి లౌడ్ స్పీకరులో నుంచి వచ్చే సినిమా పాటలు వినిపించసాగాయి. శేఖర్‌కు నిద్రపట్టక అటూ, ఇటూ దొర్లుతున్నాడు. లేచి కిటికీ తెరచి చూశాడు. కరెంటు పోయినట్టుంది. వెంటనే కిటికీ మూసేశాడు. ఎందుకో శేఖర్‌కు ఎడతెగని ఆలోచనలు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే ఉంటాడు. ఆఫీసులో కూడ అంతే ఫ్రెండ్స్ ఎంత మాట్లాడిద్దామనుకున్నా తను మాట్లాడడు. అడిగిందానికి జవాబు మాత్రం చెబుతాడు అతని మనస్తత్వం గూర్చి అందరూ జోకుగా నవ్వుకుంటారు. ఉన్నట్టుండి తలుపు దబ, దబా చప్పుడైంది. ఎవరూ అనుకుంటూ తలుపు తీశాడు. కొవ్వొత్తి వెలుతురులో లత స్పష్టంగా అగుపిస్తోంది.

లతా! నువ్వా! అన్నాడు అప్రయత్నంగా

అవును నేనే అంది లోపలికొస్తూ

ఇంత రాత్రిపూట, వర్షంలో ఎక్కడి నుంచి రావటం?

పొద్దుననగా వచ్చాను. ఆఫీసులో పనికాలేదు. పని అయిన తర్వాత బయట పడేసరికి వాన మొదలయింది. ఇంత సేపు బస్‌స్టాండులోనే ఉన్నాను. అంది ముఖం పైన పడిన తడిసిన వెంట్రుకలను సరిచేసుకుంటూ.

ఇంతకూ ఏం పని! అని అడిగాడు శేఖర్

ఉద్యోగమన్నాక సవాలక్ష పనులుంటాయి. నీకు తెలియందేముంది హెడ్డాఫీసు ఇక్కడ. నా ఉద్యోగమక్కడ. ప్రతి పనికి ఇక్కడికే రావల్సి ఉంటుంది.

అయినా పొద్దుననగా వచ్చినదానివి ఇంటికి రాకూడదు! అన్నాడు ఆమె ఆపాద మస్తకం తేరిపార చూస్తూ.

అదిసరేగాని ఇంట్లో ఎవరూ లేనట్టుగా ఉంది. మీ శ్రీమతి ఎటు వెళ్ళింది?

అంది కొంగుసిండుకుంటూ. పుట్టింటికి అన్నాడు.

అబ్బ! చలిగాలి వస్తోంది తలుపెయ్యంపి

అభ్యంతరం లేదుగా అన్నాడు ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

అంత అవసరం లేదు అంది ముసి, ముసిగా నవ్వుకుంటూ.

ఎందుకు! అన్నాడు ఆమె తడిసిపోయిన విండైన వక్షస్థలాన్ని చూస్తు.

నాకా మాత్రం నమ్మకం ఉంది కనక. ఎవరిమీద నమ్మకం?

మీమీదే సూటిగా చూస్తు జవాబిచ్చింది. నన్ను నమ్మకండి ఇప్పుడు నేను నమ్మ దగిన మనిషిని కాను.

ఫర్వాలేదు మీ మనసు సంగతినాకు తెలుసు. అది ఎప్పటికీ మారదు.

ఎందుకు మారదు. అలా మారినందుకే గదా మనమిలా వేరయ్యాము. ఆమె ముఖం వివర్ణమైంది.

అతను చలించాడు 'లతా' బాధపడ్తున్నావా! లేదు అంది నిర్లిప్తంగా,

అన్నట్లు నేను మరిచేపోయాను. మీరు నిల్చొనే ఉన్నారు అలాకూర్చోండి అన్నాడు.

ఇలాగే కూర్చోమంటావా అందిపక్కున నవ్వుతూ.

మరి ఎలా కూర్చోమంటారూ అనేదాని కంటె పొడిబట్టలు ఇవ్వమని అడగ రాదూ! అన్నాడు.

మీ బట్టలు ఇచ్చేరు కొంపతీసి మీ శ్రీమతి గారి ఒకచీరె, బ్లౌజ్ ఇవ్వండి అంది.

ఓ దానికేం అంటూ లోపలికెళ్ళిబీరు వాలో నుంచి ఒక నీలం రంగు ఫుల్ వాయిల్ చీరె, దానికి మ్యాచ్ అయ్యే

జాకెట్టు తెచ్చి ఇచ్చాడు,

అం మీరు అలా లోపలికెళ్ళి తలుపు గడియ పెట్టుకోండి నేను 'తియ్యి' అనే దాక తియ్యొద్దు అంది అందుకుంటూ,

అయిదు నిమిషాలు అయ్యాక అం ఇక రావచ్చు అంది.

ఈ చీరలో మీరు బాగున్నారు అన్నాడు. అప్పుడే మొదలైంది పొగడ్తలు. అలా అయితే నేను వెళ్ళిపోతా మరి అంది బుంగమూతి పెడుతూ,

ఇప్పుడు నేనే మన్నానని.

ఏమీ అనలేదు గాని. అలాటిమాటలు మాట్లాడవద్దు అది సరేగాని, తినడానికే మైనా ఉందా. పొద్దుననగా తిన్నాను. ఆకలిగా ఉంది.

ఏమీలేదు. నేను హోటల్లోనే తింటు న్నాను. ఇప్పుడు టైం పదవుతోంది, హోటల్లు కూడ మూసేస్తారు. నీకు

చాతనయితే 'స్టౌ' వుంది వండుకో అన్నాడు.

ఇక తప్పుతుందామరి. ఆడవాళ్ళకు ఎటూ పోయినా వంటతప్పదు.

పద వంటిల్లు చూపెడతా. అంటూ దారి తీశాడు.

అదిగో గ్యాసు 'స్టౌ' ఇక మొదలు పెట్టు వంట.

మీరు ఇక్కడ కూర్చుంటే వంట కాదు. అలా వెళ్ళి రెస్టు తీసుకోండి అంది. చిత్తం అలాగే అన్నాడు.

బయట అలాగే సన్న సన్నగా చినుకులు పడుతున్నాయి. కిటికీలో నుండి ఈదురుగాలి వస్తోంది. కిటికీ తలుపు మూసాడు. కరెంటు వచ్చింది ఆంధ్ర ప్రభ వీక్లీ పట్టుకొని బెడ్ పై వాలాడు. కాని మనస్సు ఎటో పోతోంది. లత తనకు ఎంత దగ్గర స్నేహితురాలో ఊహించుకున్నాడు. వంటగదిలో నుండి స్టౌ చప్పుడు వస్తోంది.

లతకు, శేఖర్ కు అయిదారు సంవత్సరాల స్నేహం, శేఖర్ ది పల్లెటూరు. బస్తీలో చదువుటకు తండ్రి శేఖర్ ని లత వాళ్ళింట్లో కిరాయకుంచాడు. అప్పుడు లత వోణీలు కూడ వేసుకునేది కాదు. శేఖర్ ఉంటున్నది ఒకే ఒక గది. లత శేఖర్ కంటె రెండేళ్ళు చిన్న. శేఖర్ స్టౌ పైన వంట చేసుకునేవాడు. ఆ ఇంటో శేఖర్ ను అంతా ప్రేమగా చూచుకునేవారు. వాళ్ళ ఇల్లంతా అతనుకలియ తిరిగేవాడు శేఖరంటే లతకు ప్రాణం. ఎప్పుడూ లత శేఖర్ వెంటే తిరిగేది. ప్రత్యేకంగా శేఖర్ పాట పాడుతుంటే లత డ్యాన్సు చేసేది. స్కూల్లో పాటల పోటీలో శేఖర్ కు ఫస్టుప్రైజు, డ్యాన్సులో లతకు ఫస్టుప్రైజు వచ్చినప్పుడు వారి ఆనందానికి హద్దులేక పోయింది. వాళ్ళ అనురాగం ఎలా మారుతుందో అని అనుకునేవారు లతతల్లితండ్రి. మెట్రిక్ పాస్ అయ్యేదాక మాత్రమే ఉన్నాడు శేఖర్ ఆ ఊళ్ళో. ఆ తరువాత వరంగల్లుకు తీసుకెళ్ళాడు శేఖర్ తండ్రి.

వేసవి సెలవులకు ఇంటికి వెళ్ళినప్పుడుదారిలోలతావాళ్ళింటికి పోయాడు. లత తనను చూసి సిగ్గు పడసాగింది. లతను చూడగానే తను కూడ ఒక్కక్షణం ఒత్తర పోయాడు. చిన్నప్పుడు తన ఎదుట డ్యాన్సు చేసే లతన ఈ లతేనా అనుకున్నాడు. ఇప్పుడు లత నిండుగా వోణీలు వేసుకుంటే ఎంతో హుందాగా కనిపిస్తోంది.

నువ్వు ఇప్పుడు చాల బాగున్నావు లతా అన్నాడు నిలువెల్లా లతనుచూస్తు.

ఎందుకు! అంది నేల చూపులు చూస్తు.

ఎందుకేమిటి! నిండైన నీ విగ్రహం చూస్తుంటే నామతి పోతోంది అన్నాడు నవ్వుతూ.

'స్టౌ' గాలి తీసేసింది శేఖర్ అలో చనలకు పగ్గం వేశాడు.

ఇద్దరు కలిసి భోజనంచె కూర్చు న్నారు. ఎన్నాళ్ళయింది లతా మనిద్దరం కలిసి తినక అన్నాడు. చాలా అయింది. అంది ముద్దకలుపుతూ. అసలు మనం భార్యా, భర్త కావలసిన వాళ్ళం.

అయినా ఆ సంగతి ఇప్పుడెదుకు. మీరు మాత్రం భర్త అయ్యారు ఒకరికి నేనే భార్యను కాలేక పోయాను. అంది జీరపోయిన గొంతుతో.

అలా అని ఎందుకనుకుంటావు. నిజం చెప్పాలంటే లతా! నీపై నాకు ప్రేమలేక పోలేదు. మా నాన్నపోర్చిద్ద లంవల్ల రజనిని పెళ్ళి చేసుకో వలసి వచ్చింది. మా నాన్నకు కష్టాలు మాళ నేను నిరాకరించటానికి అశక్తుణ్ణై పోయాను.

నా పెళ్ళయిన మరిపటి సంవత్స రమే మాచెల్లాయికి నాకు వచ్చినకట్నం పోసి పరున్ని తెచ్చాం. ఇప్పుడు చెప్పు! నేనెటువంటి పరిస్థితుల్లో పెళ్ళిచేసుకు న్నానో! అంటూ చేయికదుపుకున్నాడు.

ఏం చెప్పమంటావు! నా రాత ఇలా వుంది అంటూ బాధతో నిట్టూర్పు విడి చింది.

అలా ఫీల్ కాకు లతా! నా స్థానంలో నువ్వుంటే ఏం చేసే దానివి?

ఇంతకాలం ఫీలవుతూనే వచ్చాను, ఇప్పుడు ఏ ఆశలు లేవు. నాన్న కనక ఉంటే ఈ పాటికి నేను కూడా ఎవరికో ఒకరికి భార్యనై పోదును. నాన్నపోయాక బ్రతుకీడ్చడం భారమైపోయింది. వర్సు ట్రైనింగ్‌కు అప్లై చేశాను. నేను విన రిన వన్ను వల్లనో, నాకిగంట చూపు వల్లనో ఎలాగైతేనేం మొత్తానికి ఉద్యో గం సంపాదించాను. ఎన్నో విషపు చూపుల్ని తప్పించుకుంటూ, ఎన్నో ఉచ్చుల్ని విడదీసుకుంటూ ఇన్నాళ్ళు పవిత్రంగానే ఉన్నాను. ఇకముందేమి కానున్నదో అని భయంగా ఉన్నది. ఈ ఉద్యోగం విడిచి పెట్టాలని పిస్తోంది. ఒక్కొక్కప్పుడు: కాని ఏం చేయను, ఉద్యోగం చేయనిదే జీవనోపాధి గడి చేట్టు లేదు. నవ్వుగా జీవితం గడువ వలసి వస్తోంది. అమ్మను చూస్తూ బ్రతుకు తున్నాను. అమ్మే లేకపోతే నేనుకూడ ఎప్పుడో చచ్చిపోయే దాన్ని.

అంత మాటనకు లతా! ఏమయిం దని? ఏంకాలేదు. ఏం కాలేదుగనకనే ఇప్పటికి విశేషంగా ఉన్నాను అయినా ఇంకా నాకేమి కావాలి. నాకు ఇంకా ఏం మిగిలింది కనుక. చిన్నప్పటినుంచి నేను ప్రాణప్రదంగా ప్రేమించిన నువ్వు ఇంకొకరి సొత్తువయ్యావు. ఇప్పటికింకా నా కేమి కాలేదు. ఇకముందే మయినా, నాకు ఆత్మహత్యే శరణ్యం.

బెడ్ లైట్ కాంతిలో ఆమె ముఖం

వివర్ణమైంది.

ఆమె ముఖంలోకి సూటిగా చూస్తూ అన్నాడు శేఖర్. నన్ను క్షమించులతా! నా కోసం నువ్వింత తపించి పరితపిస్తున్నావని తెలిస్తే నేను వివాహం చేసుకునే వాడివి కాను. నేను జీవితంలో ఓడిపోయాను శేఖర్ అంటూ భోరున ఏడ్వసాగింది లత.

ఛ అలా ఏడవకూడదు అంటూ కళ్ళనీళ్ళు తుడిచాడు.

చూడు లతా! నీ జీవితాన్ని సరిదిద్దగల అవకాశాన్ని నాకిస్తావా అన్నాడు ఆమె ముఖాన్ని తన ముఖానికి అనించుకుంటూ.

ఆమె కళ్ళు ఆశతో మిల, మిల మెరిశాయి. అంతలోనే మళ్ళీ ఆలోచించి నాకు తెలుసు ఎవ్వరినైనా పెళ్ళి చేసుకొని సుఖపడమంటావ్! అంతేకదూ అంది.

అపును కరెక్టుగా ఊహించావులతా! డాక్టర్ మధు చాల సున్నిత మనస్సు కలవాడు. నాకు ప్రియస్నేహితుడు అతనితో నీ పెళ్ళి సెటిల్ చేస్తాను.

మహాగొప్పపని చేస్తారుఅందిఎక్కి, ఎక్కి ఏడుస్తూ. నాకు ఎవరితోనూ పెళ్ళి అవసరంలేదు. ఈ రాత్రి మీతో గడుపుతాను. అది చాలు నా జీవితానికి.ఆతరువాత నేనేమయినా ఫర్వాలేదు.

వద్దులతా! వద్దు! నిన్ను మరోసారి మోసం చేయలేను నేను.

ఊఁ మోసం! అడుగడుగునా ఈ జీవితంలో మోసం తప్ప ఇంకేం లేదు. శేఖర్ నా ఈ తుదికోరిక మన్నించండి. నా జీవితానికో ధన్యత చూపెట్టండిఅంది అతని ఒడిలోకి ఒరుగుతూ.

ఎందుకు లతా! నిన్ను నువ్వు మోసం చేసుకుంటావు.

ఒకరిచే మోస పడటం ఇష్టం లేక. అంటే అన్నాను విస్మయంగా.

ఏం లేదు. ఈ ఉద్యోగం నేను చేయక తప్పదు. ఎంత నిక్కచ్చిగా ఉన్నా నా చుట్టూ ఉన్న మనుష్యులవలలు పన్నుతున్నారు. ఏ క్షణంలోనైనా నేను మోసపోక తప్పదు. అందుకే ........ అందుకే శేఖర్! నా జీవితాన్ని. నా సర్వస్వాన్ని ముందుగా నేను ప్రేమించిన వ్యక్తికే అంకితం చేయదలచాను. ఆ తరువాత నేనేమయినా ఫర్వాలేదు. అదే నాకు తృప్తి. అదే నాకానందం.

ఆవేశంగా చెప్పుచున్న ఆమెమాటలు వింటుంటే అతని మనసంతా అల్లకల్లోలమైంది లతా! లతా! నీకెలా చెప్పాలో ఏమని చెప్పాలో తెలియటం లేదు నాకు అన్నాడు.

* * * *

ఆఫీసునుండి శేఖర్ రాగానే రిజిష్టరు కవరొచ్చింది అని చెప్పింది అతని పైవిప్పుతూ భార్య రజని. నేను కాఫీ

పెడతాను, మీరు చదువుతూండండి అని వెళ్ళింది. అడ్రసు చూచి లత వ్రాసిందని సులువుగా గ్రహించాడు. కవరులో రెండు ఉత్తరాలు కనిపించాయి. ఒకటి తనపేరుపైన, రెండవది రజని పేరు మీద వ్రాసినది. ఈజీ ఛేర్ లో కూర్చొని చదవసాగాడు.

ఈ ఉత్తరం మీకు అందే లోపల నేను శాశ్వతంగా ఈ లోకం నుండి వెళ్ళిపోతాను. నేను ఊహించినది అక్షరాలా జరిగి తీరింది. నేను దేనికైతే భయపడ్డానో ఎంతగా నేను తప్పుకోవాలని తిరిగానో అదే నాకు ఎదురయింది. శత విధాల నేను ఆ పరిస్థితుల్లో ఇరుక్కోరాదని తల పోశాను. కాని లాభం లేకపోయింది.

ఆ రోజే నాది నైట్ డ్యూటీ.

హాస్పిటల్లో అర్ధరాత్రి పేషెంటుకు ప్రమాదస్థితి ఏర్పడింది. అతని అరుపులకు హాస్పిటలంతా దద్దరిల్ల సాగింది. వెంటనే వెళ్ళి మత్తు ఇంజక్షన్ ఇచ్చాను. కాని ఏ క్షణంలో ఏం సంభవించునో అని వెంటనే డాక్టర్ మధుకు ఫోను చేశాను. పది నిమిషాల్లో డాక్టరు మధు వచ్చాడు. జరిగిన సంగతి అతనికి చెప్పాను. గబ, గబా అతను పేషెంటు దగ్గరికి వెళ్ళి చూచాడు. ఆ పేషెంటు చనిపోయి ఉన్నాడు. డాక్టరు మధు నా వంక తీక్షణంగా చూచాడు. అతని కళ్ళు చింత నిప్పుల్లా ఉన్నాయి. నాకు భయమేసింది. ఎలా డాక్టర్ ఇప్పుడెలా డాక్టర్ అని భోరున ఏడ్చాను. నా గొంతు ఎండిపోసాగింది. కళ్ళు తిరగసాగాయి. ఏ క్షణంలో నేను పడిపోతానేమో అనిపించింది. అతను జవాబు చెప్పకుండానే నా చెయ్యి పట్టుకొని గబ. గబా, స్టాఫ్ గదిలోకి లాక్కుపోయాడు. చెప్పు, అతన్ని ఎందుకు చంపావు. ఎవరైనా చంపమని డబ్బులిచ్చారా! అతన్ని చంపినందువల్ల నీ కొరిగే దేమిటి? చెప్పు! చెప్పు అని వేధించాడు.

నేను .. నేను అతన్ని చంపటమా! భగవాన్! నేనుచంపలేదుడాక్టర్ అన్నాడు. యూస్టుపిడ్ అతన్ని నువ్వే చంపావు.

డాక్టర్ నన్ను నమ్మండి! అతన్నినేనెందుకు కావాలని చంపుతాను, పెడబొబ్బలు పెడుతుంటే, 'మార్ఫియా' ఇంజక్షనిచ్చాను.

ఆ ఇంజక్షన్ వల్లనే అతడు చనిపోయాడు. అంత బాధలో అతనికి ఆ ఇంజక్షన్ ఇచ్చేదికాదు. ఒకప్రాణాన్ని నిలువుగా తీసేశావు. నిన్ను ఊరికేనే వదలిపెట్టను. అని కసిగా అన్నాడు. (అప్పుడు మీరన్న మాటలు గుర్తొచ్చాయి. డాక్టర్ మధు మంచి వాడన్నారే, పెళ్ళిచేస్తానన్నారే, అతనేనా ఈ డాక్టర్ అనుకున్నాను )

అతనోసారి నా చేయిపట్టుకుంటే కసరికొట్టాను. ఆ కసి ఈ కేసు ద్వారా

తీర్పుకుంటాదేమో అనుకున్నాను.

ఈ కేసుని ఫైలు చేయకుండా అపి నన్ను రక్షించండి అని జాలిగాఅన్నాను.

సిగరెట్టు ముట్టించుకుంటూ, మరి నా మాట వింటావా అన్నాడు నా చేతుల్ని పట్టుకుంటూ.

అర్థమయింది నాకు. చేతులు విదిలించుకొని ఆ గదిలో ఉండకూడదనుకుని వెనక్కి తిరిగాను అంతే, అతడు నా జడను పట్టి మీదకులాక్కున్నాడు.అలాగే మీద పడ్డాను. నన్ను అలాగే అదిమిపట్టి ఒక చేత్తో దగ్గరలోనే ఉన్న తలుపు మూసి గొళ్ళెం పెట్టాడు నాశాయశక్తులా అతనితో పెనుగులాడాను. అరవాలనుకున్నాను. కాని ఏం లాభం నా పరువు పోతుంది. అరవలేక పోయాను. మృగంలా మీదపడ్డాడు మంచిగా చెబితే వినిపించుకోవు అంటూ నన్ను కదలనీయకుండా చేసి పూర్తిగా ఆక్రమించాడు నా బలం పన్నుగిల్లింది కొద్దిసేపు అటూ, ఇటూ గింజుకున్నాను. నన్ను నాశనం చేశాడు మూర్ఖుడు. ఇక ఆగదిలో ఒక్క క్షణం కూడ ఉండకుండ బయటికి వచ్చాను. మేర్కుతో ఉన్నకొందరు పేషెంట్లు అర్థంకాక నా వంక, చెదిరిన నా వెంట్రుకల వంకా వింతగా చూడసాగారు. నేనెవ్వరినీ చూడకుండాబయట పడ్డాను.

డ్యూటీ అయిపోయిందా తల్లీ అని మా అమ్మ అడిగినప్పుడు ఏం సమాధానం చెప్పకుండానే ముసుగు తన్ని పడుకున్నాను. ఆ రాత్రి కలవరింతలో విపరీతమైన జ్వరం వచ్చింది. తెల్లవారి హాస్పిటల్ వెళ్ళలేదు. ప్రతిక్షణం నా కళ్ళల్లో చచ్చిపోయిన ఆ పేషెంటు, నన్ను 'రేప్' చేస్తున్న డాక్టరు మధు గుర్తుకు వచ్చి మెలికలు తిరిగాను. నా బ్రతుకు పైననే అసహ్యం వేసింది. కాని శేఖర్! నువ్వా రోజు నాకు ప్రసాదించిన సుఖం ఎంతో విలువైనది. అది జన్మ జన్మలనుండి చేసుకున్న పుణ్యం వల్లనే లభించిందేమో! కాని ఒక్కనాడ రజనికి నేను ద్రోహం చేశానేమోనని తలచుకున్నపుడల్లా నా మనసంతా అల్లకల్లోలమై పోతోంది. ఎలాగు నేను నా శీలాన్ని కోల్పోయాను. ఇంకా ఇలా బ్రతికుండి ఈ ఉద్యోగం చేస్తుంటే ఎందరికో నేను బలైపోతుండాలి. శేఖర్! నేను బ్రతికి ఏం ప్రయోజనం! అనుక్షణం ఇలా అయిపోతినే అని కుమిలి, కుమిలి ఏడ్చి చచ్చే కంటే ఒక్కసారిగా నాకు నేను చావటం ఎంత మంచిదో ఆలోచించాను. అందుకే ఈ నిర్ణయానికి వచ్చాను. రజనిని చూడాలని, క్షమాపన వేడుకోవాలని అనుకున్నాను. కాని ఈ పాపపు ముఖం ఆమెకు చూపెట్టలేను. అందుకే........ శేఖర్! ఇందులో రజనికో ఉత్తరం రాశాను. ఆ రోజు నీ పొందు కోరిన

వ్పుడు అసహ్యించుకున్నావా శేఖర్! నువ్వేమైనా అనుకో అనే నిన్ను అడిగాను. ఆ ఒక్క బాంధవ్యంతోనే తృప్తిగా చచ్చిపోతున్నాను. శేఖర్! ఇక శాశ్వతంగా సెలవు. అశ్రుపూరితంగా నీకివే నా అంజలులు ఘటిస్తున్నాను.

ఇట్లు

నీ లత

ఉత్తరం చదివి బాధ, ఇలా కన్నీరు కార్చాడు శేఖర్.

రజని కాఫీ తెస్తూ ఏమిటండీ ఏడుస్తున్నారు. ఏమిటి ఏం జరిగిందంటూ కంగారుగా కాఫీ కప్పుని పక్కన పెట్టింది.



రచయిత ;

వై. రత్నాసాగర్

ఏం లేదు రజనీ! ఏంలేదు అన్నాడు. ముఖాన్ని రెండుచేతులతో కప్పుకుంటూ. రజని ఉత్తరం తీసుకొని చదవసాగింది పల్లి రజనికి.

నీకు నేనేమని వ్రాయాలో బోధపడటం లేదు నా గోడు అంతా శేఖర్‌కు వ్రాసిన ఉత్తరంలోనే ఉంది. అదిచదివి నన్ను సహ్యించుకుంటావా! నేను నీకు ద్రోహం చేశాను. అనంతంగా నీభర్త ప్రేమను ఒకరాత్రి నేనుపంచుకున్నాను. నన్ను క్షమిస్తావా రజనీ! శేఖర్‌ను కూడా క్షమించు. అతనికి నీ ప్రేమను దూరం చేయకు. అందుకే ఉత్తరం వ్రాశాను. జీవితంలో నేను ఓడిపోయాను అందుకే నేను ఈ కుళ్ళు బుద్దులు గల మనుష్యుల మధ్యనుండి శాశ్వతంగా తప్పుకుంటున్నాను రజనీ! నాకు క్షమాభిక్ష ప్రసాదిస్తావని వేడుకుంటున్నాను. ఈ నా చివరిసారి కోరిక తీరుస్తావు కదూ!

శాశ్వతంగా సెలవు.

రజని కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అనుకుంది. అసలు ద్రోహి ఎవరు? కళ్ళులేని ఈ కుళ్ళు సమాజం మాటే చెప్పాలి అని?

* * * * *

కథల పోటీ :

రచయిత (త్రి) లు నాలుగు ఫుల్‌స్కేప్ పేజీలకు మించకుండా సాంఘిక కథలను పంపించవలెను. ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా రూ 100/- రూ. 75/-, రూ. 50/-లు ఇవ్వబడును. ప్రచురించే కథలకు పారితోషిక మివ్వబడును.

# ఆదర్శ అధ్యాపకుడే విద్యార్థికి ఆశాకిరణం

—దామరాజు భ్రమర
వరంగల్.

గురు బ్రహ్మ, గురు విష్ణు, గురుదేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః

అని అనవలసిన నోళ్లు (వాళ్ళు) "గురువు బోరు, గురువు పిసునారి, గురువు (సుత్తి) (మత్తు) అంటున్నారు.

దీనికి కారణం ఏమిటి?

దీనికి కర్త లెవరు?

ఈ లోపం విద్యార్థులలో వుందా? లేక ఉపాధ్యాయుల (పంతుళ్ళ)లో వుందా? నిజానికి అసలు విద్యార్థులు ఎలా వుండాలి?

విద్యార్థుల ఆశయం ఏమిటి? వారు ఎలా ప్రవర్తించాలి?

వారి ఆశయాలు ఎలా నెరవేర్చుకోవాలి?

ఈ ప్రశ్నల జవాబుపై విద్యార్థి యొక్క భవిష్యత్తు ఆధారపడి వుంది.

కాని ఉపాధ్యాయుల తెలివి తేటల మీద ఉపాధ్యాయుల బోధనా నైపుణ్యం మీద వందలాది విద్యార్థుల భవిష్యత్తు ఆధారపడి వుంది.

ఐతే అధ్యాపకులు అనవచ్చు "ఇది వరకు విద్యార్థులు గురువులని వెతుక్కుంటు వచ్చి గురువులను మెప్పించి, గురు ఆశ్రమంలో వుండి చెట్లకింద విద్యార్థులై చదువుకొనేవారు, మరి ఇప్పుడో మేము వారిని వెతుక్కుంటూ తరగతికి వెళ్ళి అయ్యా కూర్చోండి. బాబూ చదువుకోండి అని అనవలసిన పరిస్థితి వచ్చింది. అని అంటారు,

నిజానికి కొంత వరకు విద్యార్థులలో కూడా తప్పువుంది. పొద్దున్నే తరగతికి వచ్చి ఏ కారణము దొరుకుతుందా బాయ్ కట్ చేయటానికి. ఎవరిని ఎలా ఏడిపిద్దామా? ఎవరిని ఎలా అవమానిద్దామా? అని కొందరు ఆలోచిస్తారు వీరి యీ ప్రవర్తనకు కారణము ఏమిటి?

చిన్నతనం నుంచి పిల్లల మనస్సు చదువుమీద, చదువుకోవడంవల్లపొందే గౌరవం, లాభాలు, మంచితనం మీదా, మంచితనంతో ఒరుంచలేనిది ఏదీ లేదని.

వారి హృదయఫలకాలమీద ముద్రించాలి,

అలా జరగక పోవటమే విద్యార్థుల ఈ ప్రవర్తనకి కారణం. తల్లిదండ్రుల బాధ్యతకూడా వుంది. అనుకోండి

...దువు చెప్ప డమే కాకుండా, విద్యార్థులతో స్నేహ సంబంధాలు పెంపొందించుకొని వారు తన మాట వినేటట్లు చేసి, తన కలుపు గోలు తనముతో వారిని మెప్పించి, వారిచే గౌరవాన్ని పొందాలి అప్పుడే విద్యార్థులు తమకు వున్న అనుమానాలు నిర్భయంగా అడిగి తెలిసి కొంటారు. అధికార నియంత్రణ చేస్తే అతని ముందు మాట్లాడక వెనక తిట్టుకుంటారు.

విద్యార్థులలో చదువుకోవాలనే తపన, ఉపాధ్యాయులలో తమ కర్తవ్యం సక్రమంగా నెరవేర్చాలనే కుతూహలం వుండాలి.

విద్యార్థులలో మానసిక చైతన్యాన్ని తీసుక వచ్చి వారిని భావి భారత పౌరులుగా తీర్చిదిద్ద గలవారుఉపాధ్యాయులే.

విద్యార్థులు చేయలేని దంటూలేదు. కాకపోతే వారికి సక్రమమైన మార్గదర్శకత్వం వుండాలి. అందుకు ఉపాధ్యాయులకు సహనం, తోడు, ఓర్పు, నేర్పు వుండాలి.

బోధనాభి రుచిలేనివారు, ఆ వృత్తిలోకి అడుగు పెట్టకూడదు.

నిజానికి విద్యార్థులను మంచి పౌరులుగా తీర్చిదిద్దే ఉపాధ్యాయులు ఎంత గొప్పవారో కదా! అందుకే ఆదర్శ అధ్యాపకుడే విద్యార్థికి ఆశాకిరణం!

—చి॥ రఘువీరజ్ఞాని
వరంగల్,

# వరకట్నం

వరకట్నం వరకట్నం ఎందుకు
రాజ లాంఛనాల వెంట వచ్చింది
రాను రాను అచారంగా మారింది
అబ్బాయి ఉంటే కావాలంటరు ఎక్కువ
అమ్మాయి అయితే ఇవ్వలేమంటారు
కుటుంబములో అందరు ఆడపిల్లలయితే
ఆ కుటుంబ పరిస్థితి చెప్పలేమంతే
ఎందరో జీవితాలను బలితీసుకుందీ
కట్నం ఇచ్చి పెళ్ళి చేసిన అనంతరం
కట్నం కోసం పంపిస్తాడు
నిరంతరం
కట్నం ఇవ్వకుండా చేస్తే పెళ్లి
పిల్ల మనింటికి రాదు మళ్లీ
గ్రహాలలో దుష్టగ్రహంఅల్లుడు
ఆడపిల్లల తల్లిదండ్రులకు కీడు
కట్నం కోసం ఎన్నో హత్యలు
భరించలేక ఎందరో చేసుకున్నారు
ఆత్మహత్యలు
ఇప్పటికైనా వరకట్నం రూపుమాపాలి
దేశాన్ని ప్రగతి పథంలో నడిపించాలి
☆